

# కృష్ణా పుష్కరం

తిరుమల తిరుపతి దేవస్థానముల హిందూధార్మిక గ్రంథాల ప్రచురణ ప్రోత్సాహ పథకంలో అందించిన ఆర్థిక సహాయంతో "కృష్ణాపుష్కరం" ప్రచురించబడింది.




శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తి

This book speaks of itself



శ్రీనివాసోరక్షతు

# కృష్ణా పుష్కరం

This book speaks of itself

కృష్ణా పుష్కరంలో ... ... ... ... ... పుటలు

# ప్రయాగ

శ్రీగంగామాత గోమాత గాయత్రిమాత భారతీయుల నిత్య పూజలుఅందుకొంటున్న ముగ్గురుతల్లులు. ఈముగ్గురుతల్లుల మూలపుటమ్మ విజయవాడ కనకదుర్గమ్మ. ఆ కనకదుర్గమ్మ పాదాలుసేవిస్తూ ప్రవహిస్తోంది కృష్ణమ్మ. కృష్ణమ్మ పుష్కరాలసంబరాలు 11-9-92నుండి 22-9-92వరకు జరుపుకుంటుంది. నదులు నాగరికతకు జనజీవనానికి, ఆర్ష సంస్కృతీవికాసానికి, దేవాలయసామ్రాజ్యప్రాదుర్భావానికి, సమాజపు పురోగతికి పథకాలు అందించాయి. దేశసంపద, జాతిఆర్థికసంపద మన నదీసంపద. నదులు ప్రజలకు తిండిపెట్టే తల్లులు.వృత్తి కల్పించే యజమానులు. సేదతీర్చే చలివేంద్రాలు. ఉత్తమప్రయాణసాధనాలు. వెలుగు, వెలుతురు ప్రసాదించే విద్యుత్‌కేంద్రాలు. దేహమనోమాలిన్యాలు నిర్మూలించే పవిత్ర జలరాశులు మన నదులు.

భూమిపైవైశాల్యం సుమారు20కోట్లచ. మైళ్ళు. దానిలో 14కోట్ల చ.మైళ్ళప్రదేశం సముద్రజలంతో కప్పబడింది. భూభాగంమొత్తంవైశాల్యంలో 29శాతం మాత్రమే. మిగిలిన71శాతం జలభాగం. భూగోళంమీద ఉన్న మొత్తం నీటి ఘనపరిమాణంలో 97.3 శాతం సముద్రాలలో వ్యాపించిఉంది. మిగతా 2.7 శాతం మంచురూపంలోను, నదుల్లోను, భూగర్భంలోను ఉంది. సముద్రాలలో ఉన్న నీటి ఘనపరిమాణం 30,84,00,000 ఘనపుమైళ్ళు. భూమిమీద ఉన్నమంచినీరు 84 లక్షల ఘనపుమైళ్ళు. ప్రపంచంలోని నదీజలాలలో 12 శాతం మాత్రమే మానవులు ఉపయోగించుకొంటున్నారు. అమెజాన్ మహానది 4195 మైళ్ళపొడవు కలిగి సెకనుకు సగటున 42 లక్షల ఘనపుటడుగులనీరు అట్లాంటిక్ సముద్రంలోకి విడుదలచేస్తోంది. ఆఫ్రికాలో ప్రవహించే నైలునది 4145 మైళ్ళపొడవు కలిగి ప్రపంచంలోని పెద్ద ఎడారియైన

సహారాఎడారిలో ప్రవహిస్తూ ఈజిప్టును సైలునదిబహుమానంగా రూపొందించింది. సూర్యుడు ఏటా 380వేల ఘనకిలోమీటర్లనీటిని ఆవిరిగా పంపుతున్నాడు. ఆ నీటిఆవిరి మేఘాలుగామారి ఏటా భూమిపై 1,25,000ఘనమైళ్ళవర్షం పడుతోంది. ఈ వర్షపునీరు, నదీజన్మ స్థానాలలో, నదీ పరీవాహక ప్రదేశాలలో పడడంవలనా, మంచు కరగడం మూలంగాను ప్రపంచంలోని నదులు జలపూర్ణాలవుతున్నాయి. ప్రపంచంలో మిక్కిలి పొడవైన నదిగాని, ప్రపంచంలో అతి పెద్ద నదిగాని ఏదీ భారతదేశంలో లేదు. 87లక్షలమంది ప్రజల్ని తన పొట్ట పెట్టుకొనియైనా దుఃఖదాయిని, ప్రపంచ దుఃఖదాయిని అనిపించుకొన్న మహా ప్రమాదకరమైన హొయాంగ్‌హోవంటి నదియేదీ భారతదేశంలో లేదు.

సర్వసాధుజనులకు సుఖాలు కలిగించి, ఆస్తికులకు సమస్త సన్మంగళాల్ని ప్రసాదించి, లోకాలకు సకల కళ్యాణ పరంపరలు అనుగ్రహించే గంగా, యమునా, రేవా, వరుణా, శోణనదీ, శోభనదీ, సువర్ణముఖీ, వేగవతీ, వేత్రవతీ, క్షీరనదీ, గరుడనదీ, కావేరీ, తామ్రపర్ణీ, ఆదిగా గల ప్రముఖమైన మహా పుణ్యనదులు భారతదేశంలో ప్రవహించడం భారతీయుల మహాభాగ్యం. పుణ్యవిశేషం

గోదావరి దక్షిణగంగ. గంగ ఉత్తరగోదావరి. సృష్టికారకులైన రాధాకృష్ణులు ప్రణయకోపావేశంతో గంగాది పుణ్యనదులపేర్లు కొన్న గోపికల్ని భూలోకంలో జన్మించమని శపించారు. ఆ గోపికలు దైన్యంతో రాధామాధవుల్ని ప్రార్థించగా శాపరహస్యం వివరించి భూలోకంలో భరతఖండంలోను మీపేర్లతో పుష్కరమహానదులై ప్రవహించి భారతీయుల హృదయక్షేత్రాలలో పుణ్యపుపంటలు పండించి మోక్షఫలాలు ప్రసాదింపమని అనుగ్రహించారు. ఆ గోపకాంతలు గంగా, నర్మదా, సరస్వతీ, యమునా, గోదావరీ, కృష్ణవేణీ, కావేరీ, తామ్రపర్ణీ, రథ్య, తుంగభద్రా, సింధు, ప్రాణహితా ఆదిగాగల ద్వాదశపుష్కరమహా

నదీకాంతలుగా ఆవిర్భవించారు. ఇది భారతదేశంలోని పుష్కర మహానదుల ఆవిర్భావానికి సంబంధించిన ఒక పౌరాణిక గాథ.

"గంగేచ యమునే చైవ
గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి
జలేఽస్మిన్ సన్నిధిం కురు"

"గంగా సింధుశ్చ కావేరీ యమునాచ సరస్వతీ
రేవా మహానదీ గోదా బ్రహ్మపుత్రా పునాతు మామ్"

'గంగేచ యమునే కృష్ణే
గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి
జలేఽస్మిన్ సన్నిధింకురు"

"కావేరీ తుంగభద్రా చ
కృష్ణవేణీ చ గౌతమీ
భాగీరథీ చ విఖ్యాతాః
పంచ గంగాః ప్రకీర్తితాః ॥

ప్రతి భారతీయుడు ఉదయం స్నానసమయంలో ఈ నదీసూక్తాలు విధిగా పఠిస్తాడు.

"ఇమంమే గంగే యమునే సరస్వతి
శుతుద్రి స్తోమం స చ తా పరుష్ణ్యా
అసిక్న్యా, మరుద్వృధా వితస్త యా
ఆర్జికియే శృణుహ్యా సుషోమయా"

ఓ గంగా, యమునా, సరస్వతి, సట్లెజ్ (శుతుద్రి), రావి (పరుష్ణి) నా ప్రార్థనలు స్వీకరించండి. చీనాబ్ (అసిక్ని), జీలం (వితస్తా)లు కలసిన మరుద్వృధా, సింధు (సుషోమా)తో కలసిన

చియాజ్ (అర్జికియా) నా స్తుతి గీతాలు అందుకొని ఆలకించండని ఋగ్వేద నదీసూక్తం పఠిస్తోంది.

మహాత్ముల, మహానదుల జన్మలు మహిత పుణ్యప్రదాలు. గంగా, యమునా, సరస్వతీ, సింధు, బ్రహ్మపుత్రా, నర్మదా, తపతీ, గోదావరీ, కృష్ణా, కావేరీ, తామ్రపర్ణి, తుంగభద్రా ఆదిగా గలవి భారతదేశంలోని మహానదులలో ముఖ్యమైనవి. గంగాస్నానం, తుంగాపానం ప్రధానంగా పేర్కొనబడ్డాయి. నదుల్లో గంగకు ప్రాముఖ్యం హెచ్చు. గంగానదిని పరమ పవిత్రమైన నదిగా మన ఆర్ష సారస్వతం, సంస్కృతి ప్రశంసిస్తోంది.

గంగాస్నానం జన్మజన్మల పాపాలు తొలగిస్తుంది. మృతజీవుల అస్థికలు గంగలో కలిపితే వారికి ఉత్తమగతులు కలుగుతాయి. భారతీయులకే కాదు విదేశీయులకు కూడా ఈ నదిపైన అపారమైన భక్తి ఉంది. అరిస్టాటిల్ తన శిష్యుడైన అలెగ్జాండర్‌ను గంగాజలం భారతదేశంనుండి కొనిరమ్మని కోరుకొన్నాడు. గంగాదర్శనం, గంగా స్మరణం పుణ్యప్రదాలని భారతీయుల విశ్వాసం.

చరకుడు, వాగ్భటుడు, చక్రపాణి దత్తుడువంటివారు గంగాజలం సర్వవ్యాధులను హరిస్తుందని ప్రకటించారు. నిరూపించారు. ఫ్రాన్సుకు చెందిన డాక్టరు హైరేల్, కెనడా మైకగల్ విశ్వవిద్యాలయశాస్త్రవేత్త డాక్టరు యస్. సి. హామిల్టన్, ఆగ్రాకు చెందిన రసాయన శాస్త్రజ్ఞుడు, పరిశోధకుడు ఈ హెచ్. హైకిన్సు వంటివారు గంగాజలంపై సమగ్రమైన పరిశోధనలు, పరిశీలనలు కావించి క్రిమిసంహారక శక్తి కలదని ప్రత్యక్ష నిదర్శనాలతో నిరూపించారు. ప్లేగు, కలరాలకు గంగాజలం దివ్యౌషధ మని నిర్ధారించారు. రూసే అనే శాస్త్రవేత్త, యూరప్‌కు చెందిన ప్రసిద్ధ వైద్య నిపుణుడు రిచర్డ్‌సన్‌లు పలు పరిశోధనల పిమ్మట ప్రపంచంలో ఏ నదీజలానికీలేని వ్యాధి నిరోధక, వ్యాధినాశక, ఆరోగ్య ప్రదాయక

శక్తి గంగాజలానికి ఉందని కీర్తించారు. ప్రపంచయాత్ర గ్రంథరచయిత మార్క్‌ట్వైన్, ఫ్రాన్సు యాత్రికుడైన టేనియర్‌లు మానవుని దేహానికి కాంతిని, మనస్సుకు శాంతిని ప్రసాదించే దివ్యమైన అమృతం గంగాజలమని ప్రశంసలు కావించారు.

మహమ్మద్ బిన్ తుగ్లక్ గంగాజలం తాగడానికి, వంటలకు ఉపయోగింపజేసేవాడని 14వ శతాబ్దికి చెందిన ఇబన్ బతూతా అనే ప్రపంచ యాత్రికుని రచనల వలన తెలుస్తోంది. అబుల్‌ఫజల్ 'ఆ ఈనే అక్బరీ' వలన అక్బరు చక్రవర్తి గంగాజలం తాగేవాడని, గంగాజలంతో చేసిన ఆహారం మాత్రమే స్వీకరించేవాడని వ్యక్తమవుతోంది. ఔరంగజేబు హిందువుల్ని ఎంతగా ద్వేషించేవాడో, గంగా జలాన్ని అంతగా ప్రేమించేవాడు. ఔరంగజేబు గంగాజలం ఉపయోగించడంలో అక్బరును అనుసరించాడని 15వ శతాబ్దానికి చెందిన ఫ్రెంచియాత్రా రచయిత బర్నియర్ పేర్కొన్నాడు. టిప్పుసుల్తాన్ ఒంటెలపై గంగాజలం రావించుకొని ఉపయోగించుకొనేవాడట. పీష్వాలు కావడికి 20 రూ॥లు చెల్లించి కాశీ నుండి పూనాకు గంగాజలం తెప్పించుకొని ఉపయోగించేవారని మరాఠీ గ్రంథం 'పీష్వా ఈ చ్యా సావలీంత్' ప్రకటిస్తోంది. గంగాజలం తాగడం మూలంగా తాను అప్పుల బాధల నుండి విముక్తుడనయ్యానని పీష్వా బాజీరావు అంగీకరించాడు. క్రీ. శ. 1525 లో ఆసన్న మరణ సమయంలో గంగాజలం పానం చేయుడంవలన శ్రీకృష్ణదేవరాయలు సజీవుడయ్యాడని చరిత్ర సాక్ష్యం పలుకుతోంది.

గంగ, భాగీరథి, జాహ్నవి భీష్ముని తల్లి గంగ స్కంద మాత కూడా. జ్యేష్ఠశుద్ధదశమీ జయవారంనాడు గంగ భూమిపైకి దిగింది. ప్రయాగవద్ద గంగలో యమున, సరస్వతి (అంతర్వాహిని) కలుస్తున్నాయి. దీనినే త్రివేణీ సంగమం అంటారు. గంగలోని నీరు తెల్లగా

ఉంటుంది. యమునలోని నీరు నీలంగా ఉంటుంది. వీని సంగమరేఖ సుందర సరళరేఖ. గంగ 3 అడుగుల లోతు ఉంటే, యమున లోతు 200 అడుగులు ఉంటుంది. Men may come and men may go but I go on forever' అన్నవిధంగా త్రివేణీ సంగమం సాగిపోతూ ఉంటుంది. భగీరథుని నుండి రామకృష్ణపరమహంస వరకూ అందరి తపస్సులూ సఫలం చేసిన పరమ పవిత్ర తీరం గంగాతీరం. గోలోకనాయకులైన రాధామాధవులు భూలోకంలో యమునాతీరాన విహరించారు. వంశీ మోహనుని మోహన వంశీగానముతో పులకించిన బృందావనం యమున మధురహృదయం. కృష్ణద్వైపాయనుడైన వ్యాస భగవానుడు యమున లోని 'కల్పి' వద్దగల చిన్న ద్వీపంలో జన్మించాడు కృష్ణ, కృష్ణ ద్వైపాయనుల జననాలతో సన్నిహిత సంబంధం కల నది యమునానది. అట్టి యమునా నదీజలం ఒక్క గుక్కెడు తాగితే సోమ యాగం చేసిన మహాపుణ్యఫలం లభిస్తుందని పురాణాలు ప్రకటిస్తు న్నాయి.

త్రివేణీ సంగమంలోని అంతర్వాహినియైన సరస్వతిని నదిగా మాత్రమే గాక వాగ్దేవతగా ఋగ్వేదం వర్ణించింది. భారతయుద్ధకేంద్రం కురుక్షేత్రం సరస్వతి ఒడ్డున ఉంది. ఇది హిమాలయాలలో పుట్టి రాజ స్థాన్ ఎడారిలో అదృశ్యమై, ఆబూ వద్ద బయటపడి, కచ్ ఎడారిలో కనుమరుగై, సౌరాష్ట్రం లోని గిర్ అడవులలో మళ్ళీ బహిర్గతమై ప్రభాసతీర్థం వద్ద పశ్చిమ సముద్రంలో లీనమైనట్లు మన వాఙ్మయం వర్ణించింది. పద్మ పురాణం కురుక్షేత్రంలో వెలసిన సరస్వతీ తీర్థాన్ని ప్రాచీన సరస్వతిగా అభివర్ణించింది. కాగా గంగకు విశేషమైన పవిత్రత ప్రతిపాదింపబడింది.

హరిద్వారం వద్ద గంగాస్నానం స్వర్గ విహారం ప్రసాదిస్తుంది. ప్రజ్ఞ, బ్రహ్మచర్య, తపః ఫలాలను గంగ అనుగ్రహిస్తుంది. కాశీకి

ఉత్తర తీరానగల గంగవద్ద 21 రోజుల ఉపవాసం భక్తునకు దేవతల దర్శనం కలిగిస్తుంది. ముందు ఏడు తరాలు, వెనుక ఏడు తరాలు గల పితరులను పవిత్రం కావించే శక్తి గంగాస్నానానికి ఉంది. గంగా దర్శన, స్పర్శన, స్మరణాలు కావించిన నరుని మాతృ పితృ వంశాలు సద్గతి పొందుతాయి. గంగా జలపానం చాంద్రాయణ వ్రత మహా ఫలాన్ని సన్నిహితం కావిస్తుంది. గంగ రాజ, చోర, భూత, పాప భయాలను నిర్మూలిస్తుంది. అమరత్వం, అమృతత్వం, అపార మహత్త్వం సిద్ధింప జేసే పరమ పావని గంగాభవాని. కాశీ ఖండం అఖండ గంగా వర్ణనల ఖండం.

కురుక్షేత్ర యుద్ధానంతరం ధర్మరాజు బంధునాశన దుఃఖాన్ని నిర్మూలించిన దివ్య తీర్థం త్రివేణీ సంగమం. ఆదిత్య, హరి హరాది దేవతల రక్షణ పొందిన ప్రాంతం ప్రయాగ. ప్రయాగలో నివాసం జన్మ జన్మల పాపాలను హరిస్తుంది. ప్రయాగ స్మరణం సర్వ పాప హరం. ప్రయాగలో చేసే శంకరభక్తితో కూడిన గోదానం శాశ్వత కైలాస వాసం ప్రసాదిస్తుంది. ప్రయాగ అంటూ ప్రాణం విడిచేవాడు బ్రహ్మ లోకం పొందుతాడు. త్రివేణీ సంగమంలో నరుడు ఏ కోరికతో మరణిస్తే ఆకోరిక నెరవేరుతుందని ప్రయాగ మాహాత్మ్యం ప్రకటిస్తోంది. ఒకప్పుడు నలుగురు కన్యలు త్రివేణీ సంగమ స్థానం సమీపించారుట. ఒక కన్యక మహా వీరుడైన చక్రవర్తి వచ్చే జన్మలో భర్త కావాలని కోరి సంగమంలో ప్రాణం విడచింది. ద్వితీయ కన్యక మహాఐశ్వర్య వంతుడు ప్రాణ నాథుడు కావాలని కోరి సంగమంలో ప్రాణ త్యాగం చేసింది. మూడవ కన్యక మన్మథునివంటి అందగాడు భర్త కావాలని వాంఛించి సంగమంలో దూకి ప్రాణం విడిచింది. నాల్గవ కన్యక లలిత

కళాకోవిదుడు తన భర్త కావాలని అర్థించి, త్రివేణీ సంగమంలో మరణించింది. ఇది గమనించిన ఒక నవ యువకుడు ఆ నలుగురు కన్యకలు తనకు భార్యలు కావాలని భావించి త్రివేణీ సంగమంలో ప్రాణం విడిచాడు. ఆ నవ యువకుడే విక్రమార్క చక్రవర్తిగా తరువాత జన్మలో ఉద్భవించి ఆ నలుగురు కన్యకలను భార్యలను కావించుకొన్నాడు. ఈ విక్రమార్క ఇతిహాసం ప్రయాగ మహిమను, త్రివేణీ సంగమ మాహాత్మ్యాన్ని ఆవిష్కరిస్తోంది.

ప్రయాగకు అతి సన్నిహితుడైన స్వర్గీయ పండిత జవహర్‌లాల్ నెహ్రూ "గంగ భారతీయులకు ప్రియమైంది. జాతీయ స్మృతులకు, భారతీయ సభ్యతా సంస్కారాలకు గంగానది ప్రతీకగా నిలచింది. నా జీవితమంతా గంగా మైదానంలోనే గడచింది. ప్రభాత సంధ్యా సమయాలలో గంగా తీరంలో సంచారం గావించే దివ్యమైన ఆనందానుభవం పొందాను." అని ప్రవచించాడు. ఆనంద భవన నివాసంకన్న గంగాతీర సంచారం స్వర్గీయ నెహ్రూ పండితునికి ఎక్కువ ఆనందానుభవాన్ని కలిగించింది.

ఈమధ్య జర్మనీ దేశానికి చెందిన ఒక వ్యక్తి తన దేశంలో అపూర్వమైన ఆధ్యాత్మికకృషి కావించి, యోగ సాధనలో, ధ్యాన సాధనలో తీవ్రంగా ప్రయత్నించి, దైవ దర్శన భాగ్యం పొందడంలో విఫలుడయ్యాడుట. భోగ దేశంలోని తనదేహం దైవ దర్శన యోగ్యం కాదనే నిర్ణయానికి వచ్చి భారతదేశంలో త్రివేణీ సంగమ స్థానానికి చేరుకున్నాడు. వచ్చేజన్మలోనైనా భారతీయునిగా జన్మించి జీవించి, జీవన్ముక్తి పొందాలనే భావన వ్యక్తం చేస్తూ చివరి ఉత్తరం వ్రాసి పెట్టి

పవిత్ర త్రివేణీ సంగమంలో ప్రాణ పరిత్యాగం కావించాడు. దేశ విదేశాలలోని జనుల విశ్వాసాన్ని అంతగా పొందగలిగిన ప్రయాగ మహిమ నిత్య స్మరణీయం. అనుదిన వర్ణనీయం. త్రివేణీ సంగమ సేవనం అవశ్య అనుసరణీయం. ఆచరణీయం. గంగా ప్రవాహంలో భారతీయ సంస్కృతి సజీవమై ఉంటుంది అని సోదరి నివేదిత ఉద్ఘోషించింది. భారతీయ సంస్కృతి సంస్కార, సద్ధర్మ వైభవాల పవిత్ర సమ్మేళనమే పావన త్రివేణీసంగమం యాగ, యోగ, త్యాగ, భోగ, రాగ, అనురాగ, విరాగ దివ్య మహాఫలాలు మహా దివ్య ఫలితాలు భక్తులకు, ముక్తులకు వర ప్రదానంచేసే భక్తి కేంద్రం, ముక్తి పీఠం ప్రయాగ! ముముక్షువులకు మోక్ష ద్వారం ప్రయాగ క్షేత్రం. మానవుని మాధవునికి సన్నిహితం కావించే మానవ మనో వికాస కేంద్రం ప్రయాగ !

"త్వత్తీరే వసంతి తవామల జలస్నానం తవ ప్రేక్షణం
త్వన్నామస్మరణం తవోదయకథా సంలాపనం పావనమ్
గంగే! మే తవ సేవనైక నిపుణోఽస్యానన్దిత శ్చాదృతః
స్తుత్వా చోద్గత పాతకో భువి కథా కాన్త శ్చరిష్యా మ్యహమ్-"

—కల్కి పురాణాంతర్గత గంగాస్తవంనుండి.

"పాపాపహారి దురితారి తరంగధారి
శైల ప్రచారి గిరిరాజ గుహా విదారి
ఝుంకార కారి హరిపాదరజోఽపహారి
గాంగం పునాతు సతతం శుభకారి వారి"

వాల్మీకి విరచిత శ్రీగంగాష్టకమ్నుండి.

"గంగే! త్రైలోక్యసారే! సకలసుఖ వధూధౌతవిస్తీర్ణతోయే।
పూర్ణబ్రహ్మ స్వరూపే! హరిచరణ రజోహారిణి! సర్వమార్గే,
ప్రాయశ్చిత్తం యది స్యాత్తవ జలకణికా బ్రహ్మహత్యాదిపాపే
కస్త్వాం స్తోతుం సమర్థ స్త్రిజగదఘహరే! దేవి! గంగే! ప్రసీద."

శ్రీశంకరాచార్య విరచిత శ్రీ గంగాష్టకమ్ నుండి.

"పునరసదంగే! పుణ్యతరంగే! జయ! జయ! జాహ్నవి! కరుణాపాంగే
ఇంద్రమకుట మణిరాజిత చరణే! సుఖదే! శుభదే భృత్యశరణ్యే.
రోగం శోకం తాపం పాపం హర! మే భగవతి! కుమతి కలాపమ్
త్రిభువనసారే! వసుధాహారే! త్వమసి గతి ర్మమ ఖలు సంసారే.
అలకానందే! పరమానందే! కురు కరుణామయి! కాతరవంద్యే,
తవ తట నికటే యస్య నివాసః ఖలు వైకుంఠే తస్య నివాసః
భో! భువనేశ్వరి! పుణ్యే! ధన్యే! దేవి! ద్రవమయి! మునివర కన్యే
గంగాస్తవ మిమ మమలం నిత్యం పఠతి నరో యః స జయతి
నిత్యమ్."

—శ్రీ శంకరాచార్యవిరచితశ్రీ గంగాస్తోత్రంనుండి.

మురారి కాయకాలి మాలలామ వారిధారిణే
తృణీకృత త్రివిష్టపా త్రి లోక శోక హారిణే,
మనో౽నుకూల కూలకుంజపుంజ ధూత దుర్మదా
ధునోతు మే మనోమలం కలింద నందినీ సదా
లసత్తరంగ సంగ ధూత భూత జాత పాతకా
నవీన మాధురీ ధురీణ భక్తి జాత చాతకా

తటాంత వాస దాస హంస సంస్పృతాహ్నికామదా
ధునోతు మే మనోమలం కలింది నందినీ సదా
సదైవ నందనందకేళిశాలి కుంజమంజులా
తటోత్థ ఫుల్లమల్లికా కదంబరేణు సూజ్జ్వలా
జలావగాహినాం నృణాం భవాబ్ధి సింధుపారదా
ధునోతు మే మనోమలం కలింది నందినీ సదా.

(శ్రీ) శంకరాచార్య విరచిత (శ్రీ) యమునాష్టకమ్నుండి

కృపా పారావారాం తపనతనయాం తాప శమనీం
మురారి ప్రేయస్యాం భవ భయదవాం భక్త వరదాం
వియజ్జ్వాలా న్ముక్తాం శ్రియ మపి సుఖాప్తేః ప్రతిదినం
సదాధీరో నూనం భజతి యమునాం నిత్య ఫలదాం
మధువన చారిణి! భాస్కర వాహిని! జాహ్నవి సంగిని! సింధుసుతే
మధురిపు భూషిణి! మాధవ తోషిణి! గోకుల భీతి వినాశకృతే,
జగదఘమోచిని మానసదాయిని కేశవకేళిని దానగతే
జయ! యమునే! జయ!భీతినివారిణి! సంకటనాశిని! పావయమామ్.

అతివిపదంబుధిమగ్నజనం భవతాపశతాకులమానసకం
గతిమతిహీన మశేషభయాకుల మాగతపాదసరోజయుగమ్,
ఋణభయభీతి మనిష్కృతి పాతకకోటి శతాయుత పుంజతరం
జయ! యమునే! జయ!భీతినివారిణి! సంకటనాశిని! పావయమామ్.

—(శ్రీ) శంకరభగవత్పాదులు.

వ్యాస, వాల్మీకి, శంకరాచార్యుల ప్రశంసలు పొందిన గంగా యమునల సంగమంలో, ప్రయాగలో జరిగే అమృత కుంభోత్సవం - కుంభమేళా చారిత్రకంగా విశేషమైన ప్రాముఖ్యం సంతరించుకొంది. క్షీర సాగర మథనంలో అమృత కుంభం ఆవిర్భవించింది. రవి చంద్ర, గురు, శనులు ఆ అమృత భాండాన్ని రక్షించారుట. మేష,వృషభ, సింహ, కుంభ రాశులలో గురు సంచార సమయాలలో ప్రయాగ, నాసిక్, ఉజ్జయిని, హరిద్వార్‌లలో అమృత కుంభోత్సవం కుంభమేళా జరుగుతుంది. ప్రయాగ, నాసిక్, ఉజ్జయిని, హరిద్వార్‌లలో అమృత భాండంలోని నాలుగు అమృతపు చుక్కలు ఆ నాలుగు ప్రదేశాలలో పడటం మూలంగా ఆ దివ్య క్షేత్రాలలో కుంభమేళాలు జరిగే ఆచారం ప్రాచుర్యంలోనికి వచ్చిందని స్కంద పురాణం తెలుపుతోంది. కాగా ఈ నాలుగు తావులలోను త్రివేణీ సంగమమైన ప్రయాగలోని కుంభమేళా క్రీశ 7 వ శతాబ్దంలో పరిపాలించిన శ్రీహర్షుని మూలంగా విశ్వ విఖ్యాతమైంది. శ్రీహర్షుడు పాల్గొన్న కుంభమేళా ఎంతో ధార్మిక ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది. ఆ ఉత్సవంలో 5 లక్షల మంది యాత్రికులు పాల్గొన్నారుట.

"అది ప్రయాగ సమీపంలోని త్రివేణీ సంగమం. సంగమ స్థితికి పడమరగా 5 మైళ్ళ విస్తీర్ణం గల ఇసుక భూమిలో కుంభామేళా సందర్భంగా శ్రీహర్షుని సర్వస్వదాన వేదిక యేర్పాటు చేయబడింది. శ్రీహర్షుని సర్వస్వ దాన వేదిక ప్రాంగణంలోనికి సాధువులు, సన్యాసులు, పండితులు, పామరులు, బీదవారు అందరూ శ్రీహర్షుని ఆహ్వానితులుగా వచ్చారు. వారికి విడుదులు నిర్మింపబడ్డాయి. గంగానది ఉత్తర తీరంలో శ్రీహర్షునికి, గంగానది పడమటి తీరాన వల్లభ రాజుకి

తాత్కాలిక రాజ నివాసాలు నిర్మితమయ్యాయి. యమున దక్షిణ తీరంలో అస్సాం రాజుకి విడిది యేర్పాటు చేయబడింది. శ్రీ హర్షుని కోశాగారంలోని అంత వెండి. బంగారం, ముత్యాలు, పట్టు, నూలు బట్టలు 5 మైళ్ళు విస్తీర్ణం గల ప్రదేశంలో పర్వతమంత ఎత్తుగల రాసులుగా పోశారు. మధ్యగా నిలువెత్తు బంగారు బుద్ధ విగ్రహం స్థాపించారు. తథాగతుని కను సన్నలలో శ్రీ హర్షుడు ఒక పథకం ప్రకారం సర్వస్వదానం నిర్వహించాడు. కుంభోత్సవపు నాల్గవ రోజున బౌద్ధ భిక్షువులకు దాన ధర్మాలు చేశాడు. ఇరవై దినాలు వైదిక బ్రాహ్మణులకు దానాలు కావించాడు. మరి పది రోజులు అవైదికులను నాస్తికులను దానాలతో సంతృప్తి పరచాడు. ఇంకొక పది రోజులు తన రాజ్యంలోని బీద సాదలను దానాలతో ఆదరించాడు. ఆఖరి రోజున సోదరి రాజశ్రీ భిక్షగా ప్రసాదించిన నూతన వస్త్రాన్ని స్వీకరించి ధరించి ప్రయాగలో కుంభమేళాసందర్భంగా సర్వస్వదానం పరిసమాప్తి కావించాడు" అని చైనా యాత్రికుడు హుయాన్ సాంగ్ శ్రీ హర్షుని కాలం నాటి కుంభమేళా వైభవం గూర్చి వర్ణించాడు. కోట లోని రాజును, పేటలోని పేదవానిని సన్నిహితం కావించింది శ్రీ హర్షుని కాలం నాటి 'కుంభమేళా. గర్భదరిద్రుడు, అగర్భ శ్రీమంతుడు సహజీవనం సాగించడానికి సావకాశం చూపింది శ్రీ హర్షుని ప్రయాగలోని కుంభమేళా నాటి సర్వస్వదానం. వర్ణాలకు, వర్గాలకు, ప్రాంతాలకు, భాషలకు, మతాలకు అతీతమైన సమ సమాజ భావనకు, సమైక్యతా సాధనకు ఆనాటి త్రివేణి సంగమం దివ్య సందేశం అందించింది. సహనం పునాదిగా నిలచే సమైక్యతా భారతావని నిర్మాణానికి ప్రయాగ దివ్య సంకేతంగా నిలచింది. కుంభమేళా భారత త్యాగ నిరతికి దివ్య హారతిగా వెలిగింది.

ఆ స్ఫూర్తితో స్వర్గీయ (శ్రీ) కె ఎల్ రావు ఉత్తర దక్షిణ భారత నదులను అనుసంధానం చేస్తూ రూపొందించిన గంగా-కావేరీ పథకం అమలు జరిగిననాడు సుందరమైన సమైక్య భారతీ సాక్షాత్కారం సుసాధ్యమవుతుంది. కన్యాకుమారీ కాశ్మీరాలు సన్నిహిత మవుతాయి. సర్వ భారత నదుల సంగమం జరుగుతుంది. భారత దేశం పెద్ద ప్రయాగ క్షేత్రమవుతుంది. ఆనాడు తమిళ జాతీయ కవి సుబ్రహ్మణ్య భారతి కలలు కన్న సమైక్య భారతి రూపొందుతుంది. " కాశీలోని పండితుల వాదాలు కాంచీపురంలో ప్రతిధ్వనించాలి. కన్నడ సీమలోని కాంచనం రాజపుత్ర వీరులకు కానుకలుగా సమర్పింపబడాలి. కావేరీ తీరపు తామల పాకులు గంగా తీరపు గోధుమల మధ్య వస్తువినిమయ పద్ధతిలో వాణిజ్యం కొనసాగాలి" అని సుబ్రహ్మణ్య భారతి కలలు కన్నాడు. గంగా కావేరులు భారతి కలను నిజం చేస్తాయి.

## మ హా న దు లు

" కల డంబోధి గలండు గాలి కలడాకాశంబునం గుంభినిం
కల డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గల డోంకారమునం ద్రిమూర్తుల త్రిలింగ వ్యక్తులందంతటం
గల డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల నీయాయెడన్.

ఇందుకల డందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి వింటే."

శ్రీనివాసుడు అన్నిటా, అంతటా నిండి ఉన్నాడని ప్రహ్లాదుడు తండ్రి హిరణ్యకశిపునికి వివరించాడు. పరమేశ్వరుని బాహ్య స్వరూపం ప్రకృతి. ప్రకృతి ఆంతరంగిక రూపం పరమేశ్వరుడు. ప్రకృతి పరమేశ్వరమయం అన్నాడు. ప్రహ్లాదుగు. పంచ భూతాలను ఆది పరాశక్తి రూపాలుగా భావిస్తాము. నదులను జల దేవతలుగా భావించి పూజిస్తాము. జలాన్ని నారాయణ స్వరూపంగా ఆవాహనం చేసి ఆరాధిస్తాము. గంగాపూజ గంగాధరునిపూజ. చెట్టూ, పుట్టా, పర్వతం, నది, పక్షి, పాము, జంతువు అన్నీ భారతీయుల పూజలు అందుకొంటున్నాయి పనికిరాని గడ్డిని తిని పాలనిచ్చే ఆవునూ, ఆ ఆవు పాలు త్రాగి విషం క్రక్కే పామునూ సమంగా పూజించే సంస్కారం, సంస్కృతి భారతీయులది. నదీ మహోత్సవాలను సగౌరవంగా నిర్వహించుకొని గర్వించే జాతి భారత జాతి. అందుచేతనే నదులు భారతీయుల పాలిట నిధులు, పెన్నిధులు. పుణ్య విధులను నిర్వహింపజేసే బుధులు, విబుధులు మన నదులు. ప్రముఖ ఆంగ్ల నాటక కర్త షేక్స్పియర్ 'ప్రవహించే నదులు ప్రవచించే పవిత్ర గ్రంథాల'ని ప్రకటించాడు. గంగా, యమునా, సరస్వతితో సమానమైన ప్రతిపత్తి పవిత్రత, ప్రాముఖ్యత, ప్రాధాన్యత గల సింధు, బ్రహ్మపుత్రా, నర్మదా, తపతీ, గోదావరీ, కృష్ణా, తుంగభద్రా, కావేరీ, తామ్రపర్ణి నదులు కూడా గణనీయాలు. స్మరణీయాలు. వందనీయాలు.

సింధు అంటే సముద్రమని అర్థం. సముద్రానికున్నంత జలరాశి ఈ నదికి ఉండడం వలన సింధు నదిగా పేరు పొందింది. మానస సరోవరం సింధునది జన్మస్థానం. కరాచీ వద్ద అరేబియా సముద్రంలో కలుస్తోంది. దీనిలో జీలం, చీనాబ్, రావి, బియాజ్, సట్లెజ్ నదులు

మిఠన్ కోట వద్ద కలుస్తున్నాయి. ఆ పంచ నదుల ప్రవాహ ప్రాంతం పంజాబ్ అయింది. సింధు నదీ పరీవాహక ప్రదేశంలో అధిక భాగం పాకిస్తాన్‌కి చెందింది. వేద మాత జన్మభూమి సింధు ప్రాంతం. తక్ష శిలా విశ్వవిద్యాలయ కేంద్రం సింధు ప్రాంతం. పాణిని వ్యాకరణం ఈ ప్రాంతం నుండే వెలువడింది. మొహెంజదారో, హరప్పా నగర నాగరికతలు ఆవిర్భవించింది ఈ సింధు భూమి నుండే. ఋగ్వేదం సింధు నదిని గూర్చి విపులంగా గానం చేసింది. సింధు సప్త సింధుగా వ్యవహార ప్రాచుర్యం పొందింది. సప్త సింధు పారశీకుల ఉచ్చారణలో హప్తహిందుగా మారి కాలక్రమాన ఆ నది పేరుతో హిందూదేశంగా స్థిరపడింది. అలెగ్జాండర్ దండ యాత్రను సింధునది తీవ్రంగా ప్రతిఘటించింది. యజ్ఞాలలో కూడా సింధునది ప్రశంసలు అందుకొంది. " కుంభే సింధు నదీ స్మృతా" అనే శాస్త్ర మర్యాద పొందింది.

బ్రహ్మదేవుడు సమాజ హితం కోసం పుత్రుని సృష్టించి జల రూపంలో పర్వతాల మధ్య నిలిపాడు. మాతృహత్యా పాతక నివారణ కోసం పరశురాముడు బ్రహ్మ సృష్టించిన బ్రహ్మ కుండంలో స్నానం చేసి పరశువుతో పర్వతాన్ని నరికి బ్రహ్మ పుత్రునికి మార్గం నిర్దేశించాడు. అదే బ్రహ్మపుత్రా నది. కల్కి పురాణం, మహాభారతం, యోగినీ తంత్రం బ్రహ్మపుత్రా నదిని తీర్థరాజ్యంగా పేర్కొన్నాయి. గౌహతికి 8 కి. మీ. దూరంలో నీలాచలంపై బ్రహ్మపుత్రా నదీ తీరంలో శక్తి పీఠాలలో ముఖ్యమైన కామాఖ్య శక్తి పీఠం వెలసింది. మన్మథ భస్మాచలం, ఊర్వశీకుండం, శ్రీ కృష్ణ అశ్వాక్రాంతం ఆదిగా గలవి బ్రహ్మపుత్రా తీరంలోనివే! ఈ ఊర్వశీ కుండంలో మాఘ శుద్ధ ద్వాదశినాడు స్నానం చేస్తే అశ్వమేధ యాగ ఫలం ప్రాప్తిస్తుందని

వివరింప బడింది. ప్రపంచంలోని పెద్ద నదియైన బ్రహ్మపుత్ర మానససరో వరంలో పుట్టి బంగాళాఖాతంలో కలుస్తోంది. డిబ్రూగర్ వరకు ఈ నది నౌకాయానానికి అనువుగా ఉంది. అస్సాం ప్రజలకు ఈ నది జీవన ప్రదాయిని. ఇది భారతీయులకు పరమ పవిత్ర వాహిని.

"నర్మదా నదీ జలం దర్శన మాత్రాన మానవుని పునీతుని కావిస్తుంది. మూడుసార్లు స్నానం చేస్తే సరస్వతి, ఏడు రోజులు స్నానం చేస్తే యమునా నది, ఒకసారి స్నానం చేస్తే గంగానది మానవుని పుణ్య పురుషునిగా మారుస్తాయి. నర్మదా నది జన్మస్థానం నుండి సంగమ స్థానం వరకూ పవిత్రమైనదే! నర్మదా నది నదులలో ఉత్తమమైనది. నరుల సర్వ పాపాలు నిర్మూలిస్తుంది. ప్రాణికోటికి పుణ్యకోటిని ప్రసాదిస్తుంది" అని మత్స్యపురాణం ప్రవచించింది. ఈ నది వింధ్య పర్వతాలలో పుట్టి బ్రోచ్ వద్ద అరేబియా సముద్రంలో కలుస్తోంది. నర్మదా నదిలో లభించే శివలింగాలు నర్మద బాణాలుగా సుప్రసిద్ధాలై శివలింగాలుగా ప్రతిష్ఠలు పొందుతున్నాయి. నర్మదా తీరంలో యాత్రలు సాగించడం, క్షేత్రాలను దర్శించడం పుణ్యప్రదమని, ముక్తిదాయకమని 'కృత్య కల్ప తరువు' అనే ధర్మశాస్త్ర గ్రంథం హితవు చెప్తోంది.

"స్నానావగాహన మాత్రేణ యా స్వర్గ వనితాజనైః"
సహా నర్మగిరాం ధాత్రీ భజే తాం నర్మదా నదీమ్

తపతి సూర్య సుత అన్నది భాగవత కథ. శ్రీ రాముడు తపతీ సాగర సంగమంలో స్నానం కావించకుండా వరం పొంది - రావణ సంహారానికి మార్గం సుగమం చేసినది తపతీనది అన్నది పౌరాణిక గాథ.

సాత్పురా పర్వతాలలో పుట్టిన తపతీ నది 450 మైళ్ళు ప్రయాణం సాగించి సూరత్ వద్ద అరేబియా సముద్రంలో కలుస్తోంది. ఆషాఢ శుద్ధ సప్తమినాడు - అది భాను సప్తమి అయితే పద్మక పర్వంగా పరిగణించి తపతీ నదిలో పుణ్య స్నానాలు కావించి జనులు, భక్త జనులు పాప విముక్తులై ముక్తులౌతారు. తపతీ తీరంలో సుమారు 200 పుణ్య తీర్థాలు వెలసి భక్తుల పాప రాసులను నిర్మూలిస్తున్నాయి.

గోదావరి దక్షిణ గంగ. భారత దేశంలోని పంచ గంగలలో గోదావరి ఒకటి. గౌతముని తపః ఫలంగా ఆవిర్భవించిన మహానది గోదావరి. కొవ్వూరులోని గోపాద క్షేత్రం గౌతమీ ప్రవాహ స్పర్శతో పునీతమైంది. భద్రాచలం, పట్టిసం, మార్కండేయ క్షేత్రం, కోటిఫలి ఆదిగా గల గౌతమీ తీరంలో వెలసిన దివ్య క్షేత్రాలలో ముఖ్యమైనవి. మహారాష్ట్రలోని నాసిక్ వద్ద త్ర్యంబకం చెంత గోదావరి పుట్టింది. నాసిక్, త్ర్యంబకం, పంచవటి పుణ్య క్షేత్రాలు. సుమారు 800 మైళ్ళు ప్రవహించి గోదావరి సముద్రంలో కలుస్తోంది. సప్త ఋషులు దీన్ని సాగర సంగమం కావించారు. ఆంధ్రప్రదేశ్ గోదావరీ నది మూలంగా 'అన్నపూర్ణ' గా విఖ్యాతమైంది. ధవళేశ్వరం వద్ద నది వెడల్పు 3 మైళ్ళు. "గోదావరీ మహా నదిలో $3\frac{1}{2}$ కోట్ల తీర్థాలు ఉన్నాయని గౌతమీ మాహాత్మ్యం తెలుపుతోంది. కోటిఫలి ముక్తేశ్వరాల మధ్య గల గౌతమీ ప్రవాహంలో విష్ణు, బ్రహ్మ, మహేశ్వర, రామతీర్థాది కోటి పుణ్యతీర్థాలను గౌతముడు కొనివచ్చి కలిపాడు. అందుచేత మునులు దీన్ని కోటితీర్థమని ప్రకటించారు. ఈ కోటితీర్థ స్నానం మూలంగా కోటి గోదానాలు కోటి కన్యాదానాలు, మూడు వందల అశ్వమేధయాగాలు చేసిన ఫలితం కలుగుతుంది. మూడు కోట్ల శివలింగాలు

యథాశాస్త్రీయంగా ప్రతిష్ఠించిన మహా పుణ్యఫలం లభిస్తుంది. మున్నూరు భూ ప్రదక్షిణములు చేసిన పుణ్య ఫలితం సిద్ధిస్తుంది. అని బ్రహ్మాండపురాణం ప్రకటిస్తోంది. ఆదికవి నన్నయ్య తెలుగు భారతానికి శ్రీకారం చుట్టింది గౌతమీ తీరమంగలి రాజమహేంద్రవరంలోనే! శ్రీనాథుని సారస్వత సృష్టికి జీవం పోసింది గౌతమీ గంగ. గోదావరి సారస్వత సృష్టికి, కృష్ణ శిల్ప నిర్మాణానికి, కావేరి సంగీత సాధనకు దోహదం కావించాయి కావిస్తున్నాయి. కాశీయాత్ర కావించిన వారు విధిగా గోదావరిని సేవించి గంగపూజ చేయాలి. గంగా జలంలో గోదావరిజలం కలిస్తేనే అది కాశీ గంగ అవుతుంది. "పాపి కొండల నడుమ పరవళ్ళు త్రొక్కుతూ - ఉప్పొంగి - ఉరకలు వేస్తూ నింగికెగసే వరద గోదావరి సొగసులు" శ్రీ బాపిరాజు ఎదలో గుసగుసలాడి గోదావరిపై కవితలు పలికించాయి.

"త్రియంబక జటోద్భూతే<br>గౌతమ స్యాఘ నాశినీ<br>సప్తధా సాగరం యాంతి<br>గోదావరీ నమోస్తుతే"

కావేరి తంజావూరును దక్షిణ భారతదేశపు ధాన్యాగారంగా చేసింది. సంగీత త్రిమూర్తులు త్యాగయ్య, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి కావేరీతీరంలో తిరువారూరులోనే జన్మించారు. శరణాగతి ధర్మం విశ్వ వ్యాప్తం చేసిన ఆచార్య పురుషులను అందించిన ఘనత కావేరీ తీరానిదే! కర్ణాటక సంగీతపు మాధుర్యాలు కావేరీ జలమాధుర్యాల నుండి పుట్టినవే! కంబ రామాయణం కావేరీ తీరానే ఉద్భవించింది. శివభక్తి తత్త్వం జ్ఞాన సంబంధర్ ద్వారా కావేరీ తీరం నుండే

విశ్వ వ్యాప్తమైంది. చిదంబరం, జంబుకేశ్వరం, తంజావూరు వంటి సుప్రసిద్ధ శివక్షేత్రాలు కావేరీ తీరంలోనివే! బృహదీశ్వరాలయం శ్రీరంగ దేవాలయం కావేరీ తీరాన్ని చిరస్మరణీయం చేస్తున్నాయి.

కావేరి పడమటి కనుమలలో కూర్గు ప్రాంతమందలి బ్రహ్మగిరి లోని ఒక చిన్న సరస్సులో జన్మించింది. అందుకే 'కూర్గు ప్రాంతపు ఆడపడుచు' గా కావేరి చీరె, సారె అందుకుంటుంది. సాగరుని కౌగిలిలో కరగిపోతుంది. ఈ నది పొడవు 475 మైళ్ళు. నదీ పరీవాహక ప్రాంతం 28,000 చదరపు మైళ్ళు. కరికాలుడు ప్రపంచంలోని మొదటి ఆనకట్టను కావేరీ నదిపై క్రీ.శ. 2 వ శతాబ్దంలో నిర్మించాడు. ఇంకొక చోళ చక్రవర్తి 1080 అడుగుల పొడవు, 60 అడుగుల వెడల్పు కలిగిన ఒక పెద్ద ఆనకట్టను శ్రీరంగం ద్వీపానికి దిగువను కావేరీపై 11 వ శతాబ్దంలో నిర్మించాడు. మైసూరు సంస్థానం కావేరిపై నిర్మించిన 15 ఆనకట్టలలో పెద్దది కృష్ణసాగర్ డాము. 50 మైళ్ళ విస్తీర్ణంగల కృష్ణసాగర సరస్సు దర్శనీయమైంది. శివ సముద్రం వద్ద 329 అడుగుల దిగువకు కావేరి ప్రవహిస్తూంది. అదే శివ సముద్ర జలపాతం. ఆ జలపాతపు గంభీర నాదాలు- రమణీయ దృశ్యాలు ఆశ్చర్యం, ఆనందం కలిగిస్తాయి

బ్రహ్మపుత్రిక విష్ణు మాయ. బ్రహ్మ కావేర రాజుకు విష్ణు మాయను దత్తత చేసాడు. విష్ణుమాయ తపస్సు చేసి విష్ణువు నుండి రెండు వరాలు పొందింది లోపాముద్రగా అగస్త్యుని భార్య కావడం మొదటి వరం. సహ్యాద్రి నుండి కావేరిగా ప్రవహించడం రెండవ వరం. విష్ణు మాయ విష్ణువు ప్రసాదించిన వరాల ప్రభావం మూలంగా మొదట లోపాముద్రగాను, తరువాత కావేరిగాను అవతరించింది.

బ్రహ్మగిరిలో ఉసిరిక రూపంలోని నారాయణమూర్తిని బ్రహ్మ తన శంఖంలో కైలాసంలోని వ్రజానదీ జలాన్ని కొని వచ్చాడు. అగస్త్యుడు లోపాముద్రను వివాహం-కావించుకొన్నాడు. దక్షిణ భారత దేశంలో నీటి ఎద్దడి యేర్పడిందని విని లోపాముద్రను జల దేవతగా రూపొందించి తన కమండలంలో నిలిపాడు. బహ్మగిరిలోని ఉసిరిక చెట్టు వద్ద ఉన్న రాతిపైన ఆ కమండలం ఉంచాడు. తాను స్నానానికి వెళ్ళాడు. గాలికి కమండలం కదలి తలక్రిందులు కాగా, లోపాముద్ర కావేరిగా వెలువడి బ్రహ్మశంఖంలోని వ్రజానదీ జలంతో కలసి పవిత్రమైన నదిగా ప్రవహించింది. అందుచేతనే ఈ కావేరీనది ఆమలక, శంఖ తీర్థాలనే దివ్య నామాలను పొందింది. ఆ దివ్య కావేరి తీర్థాలలో స్నానం కావించడం బహు పుణ్య ప్రదమని ఆగ్నేయ పురాణం ప్రతిపాదిస్తోంది. "కావేరీ ఘటకే స్మృతా" అంటే గురుడు తులా రాశిగతుడైనప్పుడు కావేరీనది పుష్కర యోగం పొందుతుంది. ఆ విధంగా పుష్కర కావేరి భక్తులకు పుణ్యాలు ప్రసాదిస్తుంది.

"తామ్రపర్ణీ సరిత్తోయం సేవనీయం ముముక్షుభిః
ముక్తీ కరోతి యత్రత్యా శుక్తిశ్చ పతితం జలమ్"

తామ్రపర్ణిలోని ముత్యపు చిప్ప తనలో చేరిన జల బిందువులను ముత్యాలను చేస్తుంది. పతితుడు తామ్రపర్ణిలో స్నానం చేస్తే పావనుడవుతాడు. ముక్తుడవుతాడు. ముత్యం వలె స్వచ్ఛంగా ఉంటాడు. అందుచేత ముముక్షువులు తామ్రపర్ణీ నదిని సేవించాలి. నీలగిరి నుండి కన్యాకుమారి వరకు విస్తరించిన పడమటి కనుమల భాగాన్ని మలయ పర్వత మంటారు. తామ్రపర్ణి మలయ పర్వతమందలి అగస్త్యమలపై ఉద్భవించింది. మన్నారు సింధుశాఖలో కోర్కై వద్ద సముద్రంలో

సంగమిస్తోంది. సంగమస్థలి కోర్కైవద్ద పుష్కలంగా ముత్యాలు లభిస్తున్నాయి. కళ్యాణదంపతులైన గౌరీ శంకరులు వివాహ శుభసమయంలో ఎఱ్ఱ తామర పువ్వుల దండలు పరస్పరం సమర్పించుకొన్నారు. అగస్త్యుడు ఆ ఎఱ్ఱతామర దండలు స్వీకరించి దక్షిణాపథం చేరుకొన్నాడు ఆ అరుణ పద్మహారాలు తామరలతంటి బుగ్గలుకల అందాల రాశిగా రూపం దాల్చాయి. ఆ నవమోహిని తామ్రపర్ణివాహినిగా అగస్త్యుని కోరికపై ప్రవహించింది. అగస్త్యుడు తన ప్రియపుత్రిక తామ్రపర్ణికి అలంకారాలుగా సమర్పించిన ముత్యాలహారాలలోని ముత్యాలుజనులకు నేటికీ కానుకలుగా లభిస్తున్నాయి. అగస్త్యమహర్షి మానవులకోసం 86 తీర్థాలు, దేవతలకోసం 32 తీర్థాలు నెలకొల్పాడు. తామ్రపర్ణిని సేవించే సమయంలో కుత్తాళం జలపాతం, నమ్మాళ్వారు క్షేత్రమైన ఆళ్వారు తిరునగరి, శఠకోపయతి తపస్సుచేసిన చింతచెట్టు ప్రాంతం దర్శించాలి. శంఖాలు, ముత్యాలు విరివిగా వితరణచేసే తామ్రపర్ణి తనలో స్నానంచేసే జనులను, భక్తజనులను దైవసేవార్హములైన శంఖాలుగా మారుస్తుంది. మలచుతుంది. అందుకే తామ్రపర్ణీ వాహిని పరమ పావనమైన దక్షిణజాహ్నవిగా ప్రఖ్యాతి పొందింది.

భారతదేశంలోని నదులన్నీ దివ్యతీర్థాలుగా యాత్రికులచేత సేవింపబడుతున్నాయి. ఆ మహానదీ తీరాల్లోని దేవాలయాలు పవిత్ర క్షేత్రాలుగా ఆరాధింపబడుతున్నాయి. ఆ నదీతీరాలలో ఋషులు ఆశ్రమాలు నిర్మించుకొని ఆ ప్రశాంత వాతావరణంలో తపస్సులు కావించి ధన్యులయ్యారు. కృతయుగం నుండి ఈ కలియుగం వరకూ నిత్యం నదులు సేవింపబడుతున్నాయి. పూజింపబడుతున్నాయి ఆత్మశ్రేయస్సు, సమాజశ్రేయస్సు దృష్టిలో ఉంచుకొని ప్రకృతి శక్తుల ఆరాధనకు రూపకల్పన చేయబడింది. వాయు, జల, ఇంధన,

వాతావరణ కాలుష్యాల నివారణకు ఆనాటి ఆచారాలలో పంచ భూతాల ఆరాధనా పద్ధతులు ప్రవేశపెట్టి అనుసరించేసారు. ప్రకృతి అనుభవింపవలసింది కాని, అదుపుచేయబడవలసింది కాదని మన భారతీయ భావన. ప్రకృతిని అదుపుజేసి, ప్రకృతి శక్తులను జయించడానికి ప్రయత్నిస్తే ప్రపంచంలోని ప్రాణవాయువు శాతం తగ్గే ప్రమాదం ఎదురవుతోంది. వాయు, జల, వాతావరణ, ఇంధన కాలుష్యాల విషవలయంలో విశ్వ పరిభ్రమణం జరుగుతోంది. అందుచేత ముందుగా జలసంపద గల నదులు ఆరాధ్య దేవతలైన జలదేవతలుగా భారతీయులకు ప్రాతః స్మరణీయాలై, ప్రతిమార్చనలు అందుకొంటున్నాయి.

తపోధనుడు, త్యాగధనుడు దధీచిమహర్షి. దేవతాసమూహం మహర్షిని సమీపించి ఆత్మార్పణం చేసి దేవకార్యం కోసం అస్థులు ప్రసాదింపమని ప్రార్థించింది. దధీచి ఆత్మార్పణకు అంగీకరించి ఆఖరి కోరిక ప్రకటించాడు. తాను తపః సిద్ధుడనయ్యాను కాని తీర్థయాత్రాఫల ప్రదుడను కాలేకపోయాను అంటూ చివరగా మహానదులలో స్నానం చేసే భాగ్యం పొందాలని దధీచి వాంఛించాడు. దేవతలు మహానదుల జలాలు ఆ క్షణంలో కొనివచ్చి దధీచిమహర్షిచేత స్నానం చేయించారు. సర్వతీర్థాలను తీసుకొని వచ్చి దధీచి సమక్షంలో నెలకొల్పారు. ఆ మహర్షి ఆ పవిత్ర తీర్థాలలో స్నానమాచరించి ఆ తీర్థాలు తన ఆశ్రమంలో శాశ్వతంగా ఉండిపోవాలని, ఆమహానదుల పవిత్రత స్థిరంగా నైమిశారణ్యంలో నుండిపోవాలని దేవతలనుండి వరంపొంది ఆత్మార్పణం చేసి దేవకార్యం పూర్తి చేసాడు. ప్రాచీన కాలంనాటి నదీ పూజనం తీర్థసేవనం దధీచిమహర్షి పరిరక్షించి భారతీయులకు దివ్యమైన వారసత్వంగా అనుగ్రహించాడు. ఆ నాటి నదీపూజలు నేటికీ పుష్కర

సమయాలలో నదీ మహోత్సవాలుగా కొనసాగుతూ ఆస్తికులైన భారతీయులు భాగస్వాములై పాల్గొనే భాగ్యం కలిగిస్తున్నాయి. తల్లి వద్ద తనయునకు అంతులేని ప్రేమ లభిస్తుంది. నదీమతల్లి వద్ద భక్తునకు అనంతమైన పవిత్రత దొరుకుతుంది. మాతృ దేవోభవ! నదీదేవోభవ!

## దివ్య తీర్థాలు

"శ్రీ వైకుంఠ విరక్తాయ స్వామి పుష్కరిణీ తటే
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్.
శ్రీ వేంకటేశ మంగళాను శాసనమ్.

"స్వామి పుష్కరిణీ స్నానం, వేంకటేశ్వర దర్శనమ్
మహాప్రసాద స్వీకారః త్రయమత్యంత దుర్లభమ్"
—భవిష్యోత్తరపురాణం.

శ్రీ వైకుంఠంపై, క్షీరసాగరంపై విరక్తితో, శ్రీనివాసుడు శ్రీమహాలక్ష్మితో రక్తితో, అనురక్తితో, విలాసంతో విహరించే తీరం శ్రీస్వామి పుష్కరిణీతీరం. శ్రీ స్వామి పుష్కరిణీ స్నానం శ్రీవేంకటేశ్వర దర్శనం, శ్రీవేంకటేశ్వర ప్రసాదలాభం మహాదుర్లభమైనవి. పంచభూతాలలో అగ్ని, జలం శ్రేష్ఠతను సంపాదించుకొన్నాయి. అగ్నిని ఆరాధించడం వలన పవిత్రత లభిస్తుంది. అగ్నిని ఆరాధించడానికి కావలసిన అర్హత నీటిలో స్నానం చేయడం వలన సిద్ధిస్తుంది. అందుచేత జలాగ్నులలో అగ్నికన్న జలం శ్రేష్ఠమైనది, జ్యేష్ఠమైనది అని ఋషులు నిర్ణయించారు. మానవుడు విధిగా అహింస, సత్యం, అస్తేయం, శౌచం, ఇంద్రియనిగ్రహం అనే పంచ మహాధర్మాలను ఆచరించాలి. ఈ పంచ మహాధర్మాలలోని నాలుగు ధర్మాలను సాధించాలంటే శౌచం ముఖ్యంగా పాటించాలి. అందుచేత మను ధర్మ

శాస్త్రం శౌచానికి అగ్రతరమైన ప్రాధాన్యం, పవిత్రత ప్రతిపాదించింది అహింస సత్యం సరసన శౌచానికి సమున్నతమైన స్థానం కేటాయించారు. శౌచంలోని స్నాన ప్రక్రియ వ్యక్తి, సమాజ, పరిశుభ్రతకు, ఆరోగ్య పరిరక్షణకు దోహదం చేస్తుంది. అంటువ్యాధులు సోకకుండా కాపాడుతుంది. శౌచవిధుల లో స్నానానికి ప్రథమ స్థానం ఇవ్వబడింది. మనో నైర్మల్యానికి, మనోనిగ్రహానికి శౌచం సహాయపడుతుంది.

"సస్నాతో యో దమస్నాతః
శ్రద్ధా శుద్ధమనోమలః"

స్నాన ఫలం మహాఫలదాయకమైంది. స్నానఫలం పూజా ఫలాన్ని సుగమం చేస్తుంది. ధ్యాన ఫలాన్ని, జప ఫలితాన్ని సులభం చేస్తుంది. "పానాగమ యో స్తీర్థం ఋషి జుష్ట జలేగురా" అన్నది తీర్థ నిర్వచనం. పుణ్యజలం కలిగి పుణ్యపురుషుల కాశ్రయమైన పుణ్యజలాశ్రయం కలిగిన పుణ్యస్థలం తీర్థం. కలియుగంలో తీర్థసేవనం క్రతు పుణ్య ఫలాన్ని ప్రసాదిస్తుంది. బీద, మధ్యతరగతి ప్రజలకోసం, సామాన్య మానవుల కోసం తీర్థయాత్రా విధులు నిర్దేశింపబడ్డాయి. తీర్థమహిమల శ్రవణం కూడా ప్రయోజనకరమే!

"పోయి సేవింప లేకున్న పుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిల కల్మష హరంబు."

అన్నారు మన పెద్దలు తీర్థమహిమను గూర్చి. తీర్థసేవనం ఎంత ఫలవంతమైందో, తీర్థ మహిమా శ్రవణం కూడా అంత అనంత ఫలవంతమైందని మన పూర్వుల నిర్ణయం. మన ప్రాచీనుల వర్ణ వర్గాతీత సమాజ స్థాపన కాంక్షకు ప్రత్యక్ష నిదర్శనంగా నిలచేది తీర్థసేవన

సంప్రదాయం. సామాన్యమైన భారతపౌరుని, అసామాన్యమైన భారత ప్రధాన్ని తమజలాలలో స్నానంకావించి పునీతులు కావడానికి సమాన మైన అవకాశాలు పంచే, ప్రసాదించే సమసమాజ స్థాపన కేంద్రాలు భారతీయ పుణ్యతీర్థాలు. ఈ తీర్థాలు తపో, దాన, యాగ, అర్చనాదులను పావనం చేస్తాయి. ఇవి దేవ, ఋషి, ఆసుర, మానుష తీర్థాలని నాలుగురకాల తీర్థాలుగా విభజింపబడ్డాయి. ఇవి క్రమానుగతంగా పవిత్రతనుకలిగి కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలలోని భక్తులకు సేవింపదగినవిగా నిలచాయి. పుణ్యనదులు దేవతీర్థాలు. దేవతీర్థాలలోఋషులు తపస్సు కావించి సాధించిన నదులు, ఋషి నివాసాలు ఆర్షతీర్థాలు. అసురులు స్థాపించినవి ఆసుర తీర్థాలు. శ్రీరామాది ఉత్తమ పురుషులు నిర్మించినవి మానుష తీర్థాలు.

తీర్థాలను మన పూర్వులుజంగమ తీర్థాలుగా, మానసతీర్థాలుగా, స్థావర తీర్థాలుగా ఇంకొక విభజనలో మూడు రకాల తీర్థాలుగా పేర్కొన్నారు. మహనీయులు, మహాత్ములు, మహర్షులు, సాధు సజ్జనులు నివసించిన పరమపవిత్ర ప్రదేశాలు, వారి ఆశ్రమ కేంద్రాలు జంగమ తీర్థాలు. షిరిడీ, రమణాశ్రమం, దక్షిణేశ్వరంలో రామకృష్ణ పరమహంస ఆశ్రమం, వాల్మీకి ఆశ్రమం, అయోధ్య, గోకుల బృందావనం, తిరువైయూరు ఆదిగా గలవి జంగను క్షేత్రాలకు ఉదాహరణలు. మహానుభావులు దేశంలో సర్వేసర్వత్రా సంచారం కావించి భారతదేశాన్నే మహాదివ్య తీర్థంకావించారన్నది. భాగవత వచనం.

" తత్రోపజగ్ము ర్భువనం పునానా
మహానుభావా మునయః సశిష్యాః
ప్రాయేణ తీర్థాభిగమాపదేశైః
స్వయం హి తీర్థాని పునంతి సంతః

"సత్యం తీర్థం క్షమాతీర్థం తీర్థమింద్రియ నిగ్రహః
సర్వభూతదయా తీర్థం" ...... సత్యం, క్షమా, ఇంద్రియ నిగ్రహం, భూతదయ, బ్రహ్మచర్యం ఆదిగా గల సర్వసద్గుణాలకు నిలయమైన మానవహృదయమే మానసతీర్థం. అట్టి మానవహృదయంగల మహానుభావులే మానసతీర్థ స్వరూపులు. వారు నిరంతర ఆరాధనీయులు వారు నిత్యపూజా భాజనులు. అట్టి మానసతీర్థం హృదయంలో కలవారే "స్వయం తీర్థః పరాన్ తారయతి" అన్న కోవకు చెందిన మహాత్ములు. కాశీ రామేశ్వరాది పుణ్యక్షేత్రాలు, మహాభారతం అనుశాసనపర్వం ఉదహరించిన పుణ్యక్షేత్రాలు అన్నీ మానవులను తరింపజేసే స్థావర తీర్థాలు. మహాభారతం నైమిశారణ్యం భూమతీర్థమని, పుష్కరం అంతరిక్షతీర్థమని, కురుక్షేత్రం త్రిలోకతీర్థమని ఉదాహరించి వర్ణించి, అభివర్ణించింది. యక్ష, కిన్నర, కింపురుష, సిద్ధ, సాధ్యులు అందరూ ఆ తీర్థాలను సేవించి కామితార్థాలు పొందారని మన సారస్వతం సాక్ష్యం పలుకుతోంది. అసురులు, ఆదిత్యులు, ఋషులు, పరమపురుషులు ఆయా తీర్థాలను సేవించి ఇష్టార్థకామ్య సిద్ధులు పొందారని మనపురాణ సాహిత్యం హితవు చెప్తోంది.

ధర్మరతిప్రదాలు, జ్ఞానప్రదాలు, భక్తివైరాగ్యప్రదాలు, ముక్తిప్రదాలు అనే చతుర్విభాగ ప్రధానములైన కోట్లాదిపుణ్యతీర్థాలు శ్రీ వేంకటాచలంపై ఉన్నట్లు బ్రహ్మ, స్కందపురాణాలు తెలుపుతున్నాయి. వాటిలో 1008 ధర్మరతిప్రదతీర్థాలు, 68 భక్తి వైరాగ్యప్రద తీర్థాలు, 7ముక్తిప్రద తీర్థాలు ప్రధానములైన తీర్థాలుగానిర్ణయింపబడ్డాయి. అవి తిరుమలకు అలంకారాలై అలరారుతున్నాయి. ఇట్టి అసంఖ్యాకములైన దివ్యతీర్థాలు ఉండడంచేత వేంకటాద్రి తీర్థాద్రి. పుష్కరాద్రి అని పిలువబడుతోంది. భువన త్రయంలోగలసమస్తతీర్థాల

కన్న ఉత్తమమైన తీర్థాలు వేంకటాచలంపై ఉన్నాయి. అందుచేత శ్రీవేంకటాద్రి ప్రదక్షిణం భూప్రదక్షిణ పుణ్యఫలాన్ని ప్రసాదిస్తుంది. బలరామునకు జగత్తులోని సమస్తతీర్థాలను సేవించిన పుణ్యఫలాన్ని శ్రీవేంకటాద్రిపైగల తీర్థాలు ప్రసాదించాయి.

ఏడుకొండలపైగల సకలతీర్థాలలోను, సర్వముక్తిప్రదతీర్థాల లోను శ్రీస్వామి పుష్కరిణి ప్రముఖమైంది. యాభైమంది ఋషుల చేత అతిపవిత్రమైన తీర్థంగా స్వామిపుష్కరిణి పరిగణింపబడింది. "విష్ణు పాదం నుండి జన్మించి, బ్రహ్మదేవుని కమండలంలో నిండి, శివునిశిరస్సున నిలచిన గంగతో శ్రీస్వామిపుష్కరిణీజలం నిండి పవిత్రతను పొందింది" అని సనందనయోగి స్వామిపుష్కరిణిని స్తుతించాడు. "శ్రీనివాసుని ప్రణయకేళీ విలాసనీమయైన స్వామి పుష్కరిణీతీరం భక్తులపాలిట ఆత్మ సాక్షాత్కార ప్రసార కేంద్రం". అని సనకయోగి ప్రస్తుతించాడు. "కీర్తన, స్నాన, పానములద్వారా తాపత్రయ నివారిణిగా వెలసిన దివ్యపుష్కరిణి స్వామి పుష్కరిణి" అని శౌనకమహర్షి ప్రశంసించాడు "సురులకు, నరులకు, జంతువులకు, పురుగులకు, సకల చరాచర జీవ రాసులకు ఆత్మావలోకనం ప్రసాదించే ఉత్తమతీర్థం స్వామి పుష్కరిణీ తీర్థం" అని శుకమహర్షి అభివర్ణించాడు "మూడుసార్లు శ్రీస్వామి పుష్కరిణీ తీర్థాన్ని స్మరించి ఏ జలాశయంలో స్నానం చేసిన మానవుడైనా బ్రహ్మలోకం పొందుతాడు" అని వ్యాసభగవానుడు వివరించాడు.

సర్వతీర్థయాత్రాఫలసిద్ధిని ఆశించి బ్రహ్మదేవునుద్దేశించి మార్కండేయమహర్షి తపం కావించాడు. బ్రహ్మ మార్కండేయునికి సాక్షాత్కరించి "సర్వతీర్థయాత్రలు కావించడానికి ఎన్ని జన్మలైనా చాలవు ప్రపంచంలోని సకలతీర్థాలు ప్రతి మార్గశీర్షశుక్ల ద్వాదశీ పర్వదినాన

అరుణోదయ సమయంలో పాప నివారణార్థం (శ్రీ)స్వామిపుష్కరిణిలో సంగమిస్తాయి. ఆ అరుణోదయ సమయంలో స్వామి పుష్కరిణిలో స్నానం చేసి నీవు సర్వతీర్థయాత్రాఫలసిద్ధిని పొందుమని" ఆదేశించాడు. మార్కండేయుడు ఆ విధంగా చేసి సర్వతీర్థసేవామహాభాగ్యం పొందాడు మార్కండేయమహర్షికి సకలతీర్థ సేవాఫలాన్ని స్వామి పుష్కరిణి అనుగ్రహించిన పవిత్రగాథ వామనపురాణంలో ఉంది.

"దేవునికి దేవునికి నీ తెప్పల కోనేరమ్మ
వేవేలుమొక్కులు లోకపావని నీకమ్మా"
—అన్నమయ్య !

బ్రహ్మపురాణం భారతదేశంలోని 12 మహానదులను పేర్కొంది గంగా, నర్మద, యమున. సరస్వతి, అశోక, విహాస్త నదులు వింధ్యకు ఉత్తరంగా ఉన్నట్లు తెలిపింది. వింధ్యకు దక్షిణంగా గోదావరి, భీమరథి, తుంగభద్ర, వేణిక, తపతి, పయోష్ణి నదులను పేర్కొంది. ఉత్తర భారతదేశంలో 6 మహానదులు "దక్షిణభారతదేశంలో 6 మహానదులు ఉన్నట్లు ప్రకటించింది. నదికి (స్త్రీ) అంశ ఇవ్వబడింది. పురుషాంశతో కూడినవానిని నదములు అని పిలుస్తారు. శోణ, సింధు, హిరణ్య, లౌహిత్య, ఘర్ఘర, శతద్రుము అనేవి పురుషాంశముతో కూడిన నదాలుగా పరిగణింపబడ్డాయి. మహానదులన్నీ దివ్యతీర్థాలుగా, తీర్థరాజాలుగా పరిగణనపొందాయి. 'విభాతి-నదీ హీనా పృథ్వీయమ్, అంటే నదులు లేనినేల కళావిహీనం అని భావం. "అనదకే జనపదే వాసా దజననం వరమ్" నదులు లేనిదేశంలో జన్మించి, జీవించడం కన్న, జన్మించకుండా ఉండడమే మంచిది.

పెక్కు పురాణాలలో" "నదీ మాహాత్మ్యవర్ణనము" కనుపించును. భారతాది గ్రంథములయందు పెక్కు తీర్థ విశేషముల మహిమలు వర్ణింపబడినవి. అనుశాసనిక పర్వమున భీష్ముడు ధర్మరాజునకు పుణ్య తీర్థ విశేషములను, గంగానదీ ప్రభావమును వర్ణించి చెప్పి ఉండెను. చంద్రభాగ, వితస్త, ఊర్మిమాలి అను వానియందు ఏడు రోజులు ఆహారవిరహితుడై ఉండువాడు ముని సమానుడు అగును. మహావన ముల చొచ్చి ప్రవహించు కాశ్మీరమండలము నందలి నదుల నీరు సేవిం చుటవలన స్వర్గము లభించును. పుష్కరము, ప్రభాసము నైమిశము, ఇంద్రమార్గము, దేవిక, స్వర్గబిందువు అనుతీర్థములందు మునిగినచో జనులు అచ్చరలతో కూడ విమానములందు విహరింతురు. హిరణ్యబిందువు, కుశే శయము అనునవి ఎల్ల పాపములను హరించును. గంధమాదనముతో కూడిన ఇంద్ర తోయము, కురంగదేశమునందలి కర తోయములలో మూడు రాత్రులు ఉపవసించి స్నానము చేయువారికి అశ్వమేధఫలము లభించును. విపాశానదీ తీరమున నరుడు బ్రహ్మచర్య దీక్షతో మూడు దినములు ఉండిన జన్మరాహిత్యము పొందును. కౌశకీ నదీతీరమున మౌనముతో ఇరువది ఒక్క దినములు ఉపవసించు నరుడు పరమగతిని సాధించును. నర్మదలో స్నానముచేసిన రాజత్వము సిద్ధించును కొన్ని తీర్థములు దుర్గమములు, మిగుల విషమములు అయి ఉండును. అట్టివానిని మనసులో స్మరించినంత మాత్రమున పాపములు తొలగును. మానవుడు అరిషడ్వర్గమును దూరముచేసి తీర్థసేవ కావించి నచో అధికఫల ప్రాప్తి పొందును. తపము, అహింస, శమదమములు అను వానితో తీర్థములు సేవించిన అమితమైన శౌచము కలుగును"

స్వర్గీయ ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారి పురాణముల లోని నదీమాహాత్మ్యము అనే వ్యాసం నుండి—

స్వర్గీయ దివాకర్ల వారు నదీ మాహాత్మ్యం వర్ణించడంలో తీర్థ మాహాత్మ్యం వివరించారు. ప్రతి భారతీయుడు ఆచరించే స్నాన సంకల్పంలో, సంధ్యావందనసంకల్పంలో, దైవపూజా సంకల్పంలో, దైవపూజావిధానంలో భారతీయ నదీ తీర్థాలను విధిగా స్మరిస్తాడు. ఈ విధమైన పవిత్ర తీర్థ స్మరణం ద్వారా భారతీయులలో దైవభక్తి, దేశభక్తి, కొనసాగుతున్నాయి. భారతీయ దివ్యతీర్థాలు జాతీయసమైక్యతను, విశ్వకళ్యాణ భావనను, బలపరుస్తున్నాయి. అఖండ భారతజాతీయ భావనను, సర్వమత ఏకత్వ సాక్షాత్కార సాధనను తీర్థాలు కొనసాగిస్తున్నాయి. ఋగ్వేదం నదులను, తీర్థాలను జలదేవతలుగా, క్షేత్రాలను పుణ్యస్థలాలుగా, మాతృభూమిని పుణ్యభూమిగా ఆవిష్కరించి కీర్తించింది. అథర్వణ వేదంలోని పృథ్వీ సూక్తం నుండి బంకించంద్రుని వందేమాతరం గీతం వరకూ దేశమాతను పరదేవతగా ప్రశంసించాయి.

పరమేశ్వరుడు ప్రకృతి రూపంలో అనుగ్రహించిన వరాలే గిరులు, తరులు, తీర్థాలూను శ్రీ వేంకటేశ్వరుడు వెలసిన తిరుమలగిరి దివ్యతీర్థాలకు ఆలవాలమై, ప్రకృతి సౌందర్యానికి నిలయమై, భారత ఏకాత్మ భావనకు కేంద్రమై యాత్రికులకు దివ్యానుభూతి పరంపరలు కలిగిస్తోంది. ఓం సరస్స్వామి తటీ జుషే శ్రీ వేంకటేశాయనమః', 'ఓం తీర్థ పంచకవాసినే శ్రీ వేంకటేశాయనమః', ఓం విశ్వతీర్థాఘ హారిణే శ్రీ వేంకటేశాయనమః,' ఓం కుమారధారికావాస స్కందాభీష్ట దాయినే శ్రీ వేంకటేశాయనమః,' ఓం హలాయుధ జగతీర్థ సమస్త ఫలదాయినే శ్రీ వేంకటేశాయ నమః' అన్న ఐదు నామాలు శ్రీ వేంకటేశ్వర అష్టోత్తర శతనామావళిలో పఠింపబడుతూ తిరుమలతీర్థాల మహిమను, శ్రీ వేంకటేశ్వర మహిమను ప్రసారం కావిస్తున్నాయి.

రెండుభాగాల ఉదజని, ఒకభాగం ప్రాణవాయువు కలసినది జలం అని శాస్త్రజ్ఞుల నిర్ణయం. ఆ కోణంలో దాపిలో స్నానం చేసేవారికి శరీర శుద్ధి కలుగుతుంది. జలంలో మహాశక్తి ఉంది అని భావించి విశ్వసించే వారికి జలం శరీర నైర్మల్యం, మనో నైర్మల్యం, ఆత్మబలం, ఆత్మ విశ్వాసం, ఆత్మానుభూతి, దైవానుభూతి ఆదిగాగల సహస్రాధిక శుభ ఫలితాలు అనుగ్రహిస్తుంది.

" నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా
న చా భాయతః శాన్తిరశాంతస్య కుతస్సుఖమ్"

— గీత

"స్థిరమైన బుద్ధి లేకపోతే భావన స్థిరపడదు. భావన లేకపోతే శాంతిఉండదు శాంతిలేక సౌఖ్యం లేదు." అన్నాడు శ్రీకృష్ణభగవానుడు గీతలో. సౌఖ్యానికి మూలాధారమైన స్థిరబుద్ధిని సంపాదించుకోవడానికి తీర్థ సేవనం అవశ్య ఆచరణీయమని ఆర్షఋషులు అభిభాషించారు. భావన దైవత్వాన్ని సన్నిహితం చేస్తుంది. 'అర్థకత్వ ప్రభావే శిలాభవతి శంకరః.' నిశ్చితభావం, ఏకాగ్ర చిత్తం శిలను శంకరుని చేస్తుంది. భావన భగవంతుని స్వరూపం. అట్టిభావన కలిగినవారికీ, నమ్మిక ఉన్నవారికి, నమ్మగలిగినవారికి దైవరక్షణ ప్రసాదింపగలిగే శక్తి నిలయం, దివ్యకేంద్రం తీర్థం. లేనివారికి $H_2O$ ల సమ్మేళనమే! రాముడు, బలరాముడు ఆదిగా గల పుణ్యపురుషులు తీర్థయాత్రలు కావించి మనకు మార్గదర్శకులయ్యారు. శ్రీరాముడు ధనుష్కోటిని కోటి నదుల ధనుష్కోటిని కావించాడు. తీరాలన్నిటికి మిన్నమైన 'శ్రీహరి పాదతీరం' అని అన్నమయ్య అనుభవ వచనం, అనుగ్రహ భాషణం తెలుపుతోంది.

“శ్రీహరిపాద తీర్థంబే చెడని మందు
మోహపాశాలు గోసి మోక్షమిచ్చే మందు.
కారమై కంటగించని కడు చల్లని మందు
నూరని కాచని యట్టి నున్ననీ మందు
కోరికతో వెలవెట్టి కొని తేవల్లని మందు
వేరువెల్లంకులు కూర్చనట్టి వెందువోనిమందు.
శ్రీహరి ||

గురుతైన రోగములు గుణము చేసే మందు
దురితములు పెడబాసే దొడ్డ మందు
నిరతము బ్రహ్మాదులు నేరుపుతో సేవించే మందు
నరకము సోరనట్టి నయమయిన మందు. శ్రీ హరి ||

పొంతముతో భయములు పొందనియ్యని మందు
మంకుబుద్ధులు మాన్పి మన్నించే మందు
పంకజాక్ష వేంకటరమణ ప్రసన్నుని మందు
సెంకించక తన దాసుల చేపట్టే మందు. శ్రీహరి ||

— తాళ్ళపాక అన్నమయ్య

“శ్రీ వైకుంఠ విరక్తాయ స్వామిపుష్కరిణీ తటే
రమయా రమమాణాయ వేంకటేశాయ మంగళమ్”

శ్రీ స్వామి పుష్కరిణీ తీరంలో విహరించే రమారమణుని, సంకటహర శ్రీ వేంకటరమణుని మంగళానుశాసనం కావించుకొంటూ సర్వ తీర్థాలు ఏ శ్రీహరి పాదతీర్థం నుండి ఉద్భవిస్తున్నాయో ఆ శ్రీ హరిపాదతీర్థం సేవించి ధన్యులమవుదాము.

# కృష్ణవేణి

"శ్రీ కృష్ణవేణీ ప్లవనాయ భూమౌ
వాంఛంతి దేవాః ఖలు మర్త్యజన్మ
తస్యాః ప్రభావం సకలం ప్రవక్తుం
శివో హరిర్వాఽబ్జభవో న శక్తః
సభాగ్యాస్తే నరా లోకే
తే చ దేశా శ్శుభోదయాః
తాన్యేవ పుణ్యక్షేత్రాణి
యత్ర కృష్ణా వహిష్యతి"

శ్రీ కృష్ణవేణీ మహానదిలో స్నానం చేయడం కోసం దేవతలు నరులుగా జన్మించాలని వాంఛిస్తారట. అట్టి కృష్ణానదీ మహిమ వర్ణించడానికి త్రిమూర్తులైనా అశక్తులే! కృష్ణానది ప్రవహించే ప్రదేశాలు శుభప్రదాలు. ఆ కృష్ణానదీ తీరవాసులు మహాభాగ్యవంతులు. కృష్ణా, గోదావరీ నదుల మూలంగా ఆంధ్రప్రదేశ్ దక్షిణ ప్రాంతానికి ధాన్యాగారంగా ఉంది. ఈ నదులు మన రాష్ట్రాన్ని ఆహారధాన్యాల ఉత్పత్తి విషయంలో స్వయం సమృద్ధం చేసి ఇతర రాష్ట్రాలకు, విదేశాలకు ఎగుమతులు చేయడానికి తోడ్పడుతున్నాయి. కృష్ణానది మహారాష్ట్రంలోని మహాబలేశ్వర్ వద్ద సముద్రమట్టానికి 4700 అడుగుల ఎత్తున జన్మించింది. కృష్ణానదిపై ఆంధ్రప్రదేశ్ లో నిర్మించిన నీటిపారుదల పథకాలలో ముఖ్యమైనవి శ్రీశైలం ప్రాజక్టు, నాగార్జునసాగర్ ప్రాజక్టు, ప్రకాశం బ్యారేజ్, కాంపుబెల్ ఆనకట్ట, తెలుగుగంగ పథకం మొదలైనవి. కృష్ణానదీ జలాలలో ఆంధ్రప్రదేశ్ కి సుమారు 20 శాతం మాత్రం లభిస్తోంది. కృష్ణానది మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్

రాష్ట్రాలలో విస్తరించింది. ప్రతిసంవత్సరం కృష్ణానది 12 లక్షల క్యూసెక్కుల వర్షపునీరు సమకూర్చుకుంటుంది. ఈ మూడు రాష్ట్రాలలో ఈ నదిపై సుమారు 40 ఆనకట్టలు ఉన్నాయి. కృష్ణానది పొడవు 778 మైళ్ళు. ఈ నదీ పరీవాహక ప్రాంతం 2,51,000 చదరపుమైళ్ళు విస్తరించి ఉంది. కృష్ణానది మహబూబ్ నగర్ జిల్లా అలంపురం వద్ద ఆంధ్రప్రదేశ్ లో ప్రవేశిస్తోంది. ఆంధ్రప్రదేశ్ లో 380 మైళ్ళు ప్రవహించి విజయవాడ సమీపంలోని పులిచింతల కొండలమధ్య సాగి పులిగడ్డవద్ద మూడు పాయలై చివరకు హంసల దీవి వద్ద బంగాళాఖాతంలో కలుస్తోంది. కృష్ణానది రెండుపాయల మధ్యప్రాంతమే దివిసీమ!

కృష్ణాడెల్టాలో 35 అంగుళాల ఏడాది సగటు వర్షం కూడా సక్రమంగా పడేదికాదు. 1833 సం॥లో కృష్ణాజిల్లాలో కనీవినీ ఎరుగని కరువు వచ్చింది. 1852 – 1855 మధ్య సర్ ఆర్థర్ కాటన్, కెప్టెన్ చార్లెస్ ఆర్ లు కృష్ణా నదిపై 7 ఫర్లాంగుల ఆనకట్ట 30 లక్షల రూ॥ల ఖర్చుతో 6 లక్షల ఎకరాల సాగుబడికి ఉద్దేశించి నిర్మించారు. 1958 లో రు. 2.80 కోట్లతో ప్రకాశం బ్యారేజ్ పూర్తి చేయబడింది. ఆయకట్టు విస్తీర్ణం 13 లక్షల ఎకరాలకు పెరిగింది. మద్రాసు కలకత్తా నగరాల మధ్యగల జాతీయ రహదారిని కలిపే 4045 అడుగుల పొడవుగల రహదారి దీనిపై నిర్మించబడింది. 24 అడుగుల రహదారి, దానికి రెండువైపులా ఐదేసి అడుగుల వెడల్పుగల కాలిబాటలు యేర్పాటు చేయబడ్డాయి. కనకదుర్గ వారధికూడా నిర్మాణంలో ఉంది.

నల్లగొండజిల్లా మిర్యాలగూడా ప్రాంతమందలి నందికొండ

గ్రామానికి 1 1/2 మైళ్ళదూరంలో కృష్ణానదిపై గల డాముకు నాగార్జున సాగర్ ప్రాజక్టు అంటారు. నెహ్రూజీ దీనికి 10. 12. 1955 వేదీన పునాది వేసారు. ఇది ప్రపంచంలో ఎత్తైన డాము. 6056 అడుగుల ఎత్తు గల రాతిసిమ్మెంటు కట్టడం సముద్రమట్టంనుండి లేచింది. నదీగర్భానికి 370 అడుగుల ఎత్తున ఉంటుంది. రెండువైపులా 85 అడుగుల ఎత్తుగల కట్టలతో 110 చ. మైళ్ళ విస్తీర్ణంగల సరస్సు యేర్పడింది. ఇది ఇండియాలో పెద్ద సరస్సు. ప్రపంచంలో మూడవది. కుడికాలువ జవహర్ లాల్ నెహ్రూ కాలువ. దీనిపొడవు 270 మైళ్ళు. ఎడమ కాలువ లాల్ బహదూర్ శాస్త్రి కాలువ పొడవు 205 మైళ్ళు. దీనివలన 8 3 లక్షల హెక్టారుల భూమికి సాగునీటి సదుపాయం లభిస్తోంది. 75,000 కిలో వాట్ల విద్యుదుత్పాదన జరుగుతోంది. కృష్ణానది ఉపనదియైన తుంగభద్రపై తుంగభద్రా ప్రాజక్టు నిర్మింపబడింది. ఈ ప్రాజక్టు వలన ఆంధ్ర ప్రదేశ్ కర్ణాటక రాష్ట్రాలలో 3.3 లక్షల హెక్టారుల భూమి సాగుకు నీటి సరఫరా జరుగుతోంది. 63,000 కిలో వాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతోంది. రాయలసీమలో 4 1/2 లక్షల ఎకరాలకు సేద్యపు నీరు సరఫరాకు, శ్రీశైలం ప్రాజక్టు, 2000 మెగావాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజక్టు ఉద్దేశింపబడ్డాయి ఇది సుమారు 900 అడుగుల ఎత్తుగల ఆనకట్ట. జలవిద్యుత్ పథకాలు సౌభాగ్య దేవతకు 'నవీన దేవాలయాలు' అని నెహ్రూజీ అభివర్ణించారు. కృష్ణానదీతీరంలో వెలసిన అధునాతన దివ్య దేవాలయం నాగార్జునసాగర ప్రాజక్టు. కుకుద్మతీ విశాలా, విజయ, వైష్ణవి, మలాపహారిణి, కుముద, కౌశిక, నారాయణి, భీమా, తుంగభద్రా, అరుణ, మూసి, ఆదిగాగల 14 ఉపనదులు తనలో లీనం చేసికొన్న కృష్ణానది ఒక అపూర్వమైన జలరాశి. ప్రకృతి సౌందర్యాన్ని అందజేసే అందాలరాశి. మహా సౌందర్యవారాశి. జనులకు సంప

దలు అనుగ్రహించే సౌభాగ్యరాశి. భక్తజనుల పాలిట పుణ్యరాశి.

అట్టి పుణ్యరాశియైన కృష్ణానదీ మాహాత్మ్యం భక్తులకు సదా స్మరణీయం. కృష్ణానదీ మహిమను శంకరుడు సుబ్రహ్మణ్యస్వామికి సాంగోపాంగంగా వివరించాడు. ఆ కృష్ణానదీ వైభవాన్ని, ప్రాశస్త్యాన్ని నారదుడు వ్యాసభగవానునకు సవివరంగా వినిపించాడు. కృష్ణద్వైపాయనుడు కృష్ణానదీ ప్రాదుర్భావ కథను సూతునకు పరిచయం కావించాడు సూతుడు శౌనకాది మహామునులకు నైమిశారణ్యంలో కృష్ణానది పవిత్రగాథను వినిపించాడు. వేదవ్యాసుడు సంతరించిన అష్టాదశపురాణాలలో స్కాందపురాణం పదమూడవది. స్కాందపురాణం. 6 సంహితలతో, 50 ఖండాలతో కూడిన పురాణం. సనత్కుమార సంహిత ఈ 6సంహితలలో మొదటిది. సనత్కుమార సంహితలో సహ్యాద్రి ఖండం ప్రథమ ఖండం. సహ్యాద్రిఖండంలో కృష్ణానదీ మాహాత్మ్యం సవివరంగా, సమగ్ర సుందరంగా ఆవిష్కరింపబడింది.

అఖండ భూమండలానికి అలంకారం భరతఖండం అట్టి భూమండలానికి వాయువ్య ఉత్తరభాగంలో - భారత భూభాగంలో సహ్యాద్రి పర్వతం ఉంది. శిష్టజన రక్షణవాంఛతో, లోకరక్షణ కాంక్షతో విశ్వ కళ్యాణ భావనతో శ్రీకృష్ణ భగవానుడు కృష్ణానది జన్మస్థావరమైన అశ్వత్థవృక్షస్వరూపం ధరించి సహ్యాద్రి పర్వతంపైన అవతరించాడు. భవబంధ విముక్తి స్వరూపిణి, పాపహారిణి, మోక్షకారిణి అయిన కృష్ణానది సహ్యాద్రి పర్వతంపైన గల అశ్వత్థ వృక్షమూలంలో ఉద్భవించింది. కల్పారంభంలో బ్రహ్మ సృష్టి ప్రారంభం చేయడం మూలంగా కృష్ణానది ఆవిర్భావం సంభవించింది.

బ్రహ్మదేవుడు కల్పారంభంలో సృష్టికార్యానికి శ్రీకారం చుట్టాడు. బ్రహ్మ వైకుంఠానికి వెళ్ళి విష్ణుమూర్తిని దర్శించి "శ్రీహరి! నేడు కలియుగం నడుస్తోంది. లోకం శోకంతో, పాపంతో, తాపంతో నిండిపోయింది. నాలుగు యుగాలు వేయి మార్లు తిరిగితే గాని కల్పం పూర్తి కాదు. కల్పగౌరవం కలియుగంలో ఎలా కాపాడాలో తెలియడం లేదు" అంటూ నివేదించాడు. దానికి శ్రీమన్నారాయణుడు "చతుర్ముఖా! నిత్యం జనాన్ని రక్షించి, జగతిని పరిరక్షించవలసిన ధర్మం కలియుగధర్మం. అందుకోసం గంగవంటి మహానదులను, సర్వపుణ్య తీర్థాలను అనుగ్రహిస్తున్నాను. సమస్త తీర్థాలకు మాతృమూర్తియైన కృష్ణానదిని నారూపంలో రూపొందిస్తున్నాను. అట్టి కృష్ణానది మూలంగా కలిదోష దూషితమైన మానవుల భావాలు, స్వభావాలు కృతయుగ జనులపవిత్రతను ఆవిష్కరించుకొని సంక్రమింపజేసుకొంటాయి." అంటూ అభయమిచ్చాడు. శ్రీవిష్ణుపాదం నుండి గంగ ఆదిగా గల మహానదులు, దివ్యతీర్థాలు జన్మించాయి. స్వస్వరూపంలో నదీమాత, తీర్థమహామాత అయిన కృష్ణానదీ మాతను శ్రీహరి సృష్టించాడు.

''దివ్యమూర్తిం. సులోచనాం
శ్యామలాం విష్ణు చిహ్నాంకాం
చతుర్బాహుం సభాషితాం
పీతాంబరాం సుప్రసన్నాం
సాక్షాత్ కల్పలతా మివ
చంద్ర కాంతి ముత్సృజ్య
వస్తుకాంతి ప్రదాయినీం

తేజస్సుక్ష్మాదపోత్పన్నాం
లావణ్యస్యాధి దేవతాం" — స్కాందపురాణం నుంచి

అందమైన కన్నులతో, శ్యామలమైన, కోమలమైన దేహంతో, శంఖచక్రాలతో, చతుర్బాహువులతో, పీతాంబరంతో, సుప్రసన్న స్వరూపంతో, చంద్రకాంతిని ధిక్కరించే దేహకాంతితో, లావణ్యాధి దేవతగా, కల్పవృక్షం వలె కృష్ణాతరంగిణీ తరుణి సుందర సుమకోమల సుషమారాగిణి వలె అవతరించింది. ఆవిర్భవించింది. ఆకృతి దాల్చింది. బ్రహ్మ, మహావిష్ణువు అనుమతితో, కృష్ణను తన అభిమాన పుత్రికగా స్వీకరించాడు. విష్ణురూపిణి కృష్ణ సత్య లోకంలో బ్రహ్మదేవుని దివ్య సన్నిధానంలో కొంతకాలం నివసించింది. బ్రహ్మలోకం నుంచి భూలోకానికి దిగివచ్చింది. దివినుండి భువికి తరలివచ్చింది. కల్పవృక్షంలా కదలివచ్చింది. కామధేనువులా నడచివచ్చింది. ముక్కోటి దేవతల దీవనలు అందుకుంటూ వచ్చింది. ఆ నదీమాత తనకు నివాస యోగ్యమైన ప్రదేశం కోసం నిరీక్షిస్తోంది. సహ్య పర్వతపతి ముని రూపం వహించి కృష్ణానదీ పవిత్ర జలాలతో పుణ్యస్నానం కావించి జగన్మాతా! కృష్ణానదీమాతా! నిన్ను నా శిరస్సున ధరించే మహా భాగ్యం ప్రసాదించుమని ఆ వరం అనుగ్రహింపమని" ప్రార్థించాడు.

"సహ్య పర్వతపతీ! నీ పుత్రికగా పుడమిపై అవతరిస్తాను. 'సహ్యజ' గా ప్రఖ్యాతమవుతాను. నీ యందు ఎన్నో నదులు జన్మించి అవి నాకు ఉప నదులు అవుతాయి." అని కృష్ణ సహ్యపర్వతానికి అభయమిచ్చింది. దేవతలు హర్షం ప్రకటించారు. జనులు, భక్తజనులు కృష్ణానదిని ఆహ్వానించారు. ఆ విధంగా కృష్ణానది సహ్య పర్వతంపైన అశ్వత్థ వృక్షమూలం నుండి ప్రవహించి సాగర సంగమం వరకు అనేక

దివ్యతీర్థాలతో, పుణ్య క్షేత్రాలతో విరాజిల్లింది. కృష్ణానదీ స్నానం వలన ఏకాత్మ భావన సిద్ధిస్తుంది. ద్వంద్వాలు ఉండవు. త్రిగుణాల నుండి త్రికాలాల నుండి అధిగమింపజేస్తుంది. ఈ షణత్రయం నుండి విముక్తి లభిస్తుంది. చతుర్విధ పురుషార్థాల సాధన సుసాధ్యమవుతుంది. పంచ భూతాల నుండి, పంచకోశాల నుండి దాస్యం తెగిపోతుంది. అరిషడ్వర్గాలకు అంతిమగీతం పాడుతుంది. సప్తభూమికలను అధిగమింపజేసి సప్త స్వరాల నాదయోగిని చేసి నాదబ్రహ్మను సంధానం సంప్రాప్తింప జేస్తుంది. "కృతకృత్యో భవేమర్త్యః, కృష్ణా స్మరణ కీర్తనైః"-కృష్ణా కృష్ణా అంటూ కృష్ణానదీ స్మరణం చేసిన నరుడు - కృష్ణానదీ కీర్తనం, సంకీర్తనం కావించిన మానవుడు నాదబ్రహ్మనందంతో ధన్యుడవుతాడు కృతకృత్యుడవుతాడు. ఇది స్కాందపురాణం సనత్కుమార సంహిత సహ్యాద్రి ఖండంలోని కృష్ణానదీ పవిత్ర అవతరణకథ. కృష్ణానదీ జన్మ వృత్తాంతగాథ !

కృష్ణవేణి నమస్తుభ్యం
సర్వపాప ప్రణాశిని
త్రిలోకే పావనజలే
రంగత్తుంగ తరంగిణి"

ప్రకృతి రమణీయతకు ఆలవాలమైన సహ్యాద్రి శిఖరంపైన బ్రహ్మదేవుడు చాక్షుష మన్వంతరానికి పూర్వం ఒక యజ్ఞం నిర్వహింంచడానికి సంకల్పించాడు. హరిహరాదులు, సమస్త దేవతలు ఆహ్వానితులై యజ్ఞప్రాంగణంలో ఉచిత ఆసనాలపై ఆసీనులయ్యారు. బ్రహ్మ

దేవతాకమైన సుముహూర్తంలో యజ్ఞదీక్షకు నిశ్చయింపబడింది. భృగుమహర్షి అధ్వర ఆధ్వర్యం వహించాడు. బ్రహ్మ జ్యేష్ఠ భార్య స్వరా (సరస్వతీ) దేవిని యజ్ఞదీక్షలో భాగస్వామ్యం వహింపమని శ్రీ మహావిష్ణువు ఆహ్వానించాడు. ఆమె రావడంలో ఆలస్యం చేసింది. ముహూర్త కాలాతిక్రమణం నివారించడానికి మార్గాంతరం చూపమని భృగుమహర్షి హరిని వేడుకొన్నాడు. స్వరాదేవి స్థానంలో గాయత్రీ దేవిని నియమించమని విష్ణువు ప్రతిపాదించాడు. శంకరుడు దాన్ని బలపరచాడు. గాయత్రీదేవితో బ్రహ్మదేవుడు యజ్ఞదీక్ష ప్రారంభించాడు. స్వరాదేవి యజ్ఞవాటికకువచ్చి గాయత్రినిచూచి గాయపడినమనస్సులో అసూయా ద్వేషాలు పెంచుకొని, సవతికి లభించిన గుర్తింపును గర్హిస్తూ "పూజ్యులు పూజలు పొందకపోవడం - అపూజ్యులు పూజలు పొందడం ధరిత్రిని భీతి, మృతి, క్షామం పట్టి పీడిస్తాయి. నేను అలంకరించవలసిన స్థానం గాయత్రి ఆక్రమించింది. కనుక అదృశ్య శరీరంతో నదీరూపం పొందుతుంది. నా స్థానంలోనికి గాయత్రికి ప్రవేశం కలిగించిన హరి హరులు- అందరూ నదులుగా జన్మించి ప్రవహిస్తారు." అని శపించింది.

"బ్రహ్మదేవుని దక్షిణ భాగాన ఆసీనురాలై యజ్ఞదీక్ష వహించడానికి నీకుఎంత అర్హత ఉందో, నాకూ అంతే అర్హత ఉంది. విధాత ధర్మ పత్నులమైన మనకు ధర్మాచరణకు సమానమైన అర్హతలు ఉన్నాయి. సమానమైన అవకాశాలు ఉండాలి. స్వరాదేవీ ! నీవు నా అర్హతను ప్రశ్నించి, నన్ను అవమానించి, నదీరూపం వహించమని శపించావు కనుక నీకూ నదీస్వరూపం రావాలని ప్రతిశాపం ఇస్తున్నాను" అంటూ గాయత్రీదేవి త్రిమూర్తులు, దేవతలూ వారించి, నివారిస్తూన్నా స్వరాదేవికి శాపమిచ్చింది. స్వరాదేవి క్రోధం దేవతల, త్రిమూర్తుల పాలిటశాపమైనా, భావి జనులకు వరమైంది. కలియుగ మానవులకు దివ్య ప్రభావంతో కూడిన అపూర్వమైన వరమైంది.

త్రిమూర్తులు, దేవతలు నదీ రూపాలుధరించి జన్మించడానికి అవకాశం కల్పించిన పరమ పవిత్రమైన పర్వతం సహ్యాద్రి పర్వతం. యజ్ఞ ఫలం పొందడంలో సఫలమైన బ్రహ్మ యజ్ఞ ఫల ప్రదాతయైన శ్రీమహావిష్ణువు గూర్చి సహ్యాద్రి ఉత్తర శిఖరంపై తపస్సు కావించాడు. శ్రీమన్నారాయణుడు శ్వేతాశ్వత్థ వృక్షరూపంలో బ్రహ్మకు సాక్షాత్కరించి అనుగ్రహించాడు. బ్రహ్మ తపస్సు చేసిన ఆ పర్వత శిఖరం 'బ్రహ్మగిరి' గా ప్రసిద్ధి పొందింది. సహ్యపర్వత దక్షిణ శిఖరంపై వేదాలు మూర్తివంతాలై శంకరుని గూర్చి తపస్సు కావించాయి. శివుడు అమలక వృక్షరూపంలో ప్రత్యక్షమై వేదమూర్తులను అనుగ్రహించాడు. అందుచేత సహ్యపర్వత దక్షిణశిఖరం 'వేదగిరి' గా ప్రఖ్యాతి పొందింది. సహ్యాద్రి పర్వతశిఖరమైన బ్రహ్మగిరిపై గల శ్వేతాశ్వత్థ వృక్షరూపంలోని శ్రీ మహావిష్ణువు జలరూపం ధరించి, కృష్ణానదీ స్వరూపం స్వీకరించి ప్రవహింప ప్రారంభించెను. అదే కృష్ణానది. వేదగిరిలోని అమలక (ఉసిరి) వృక్షరూపంలోని గంగాధరుడు గంగారూపం ధరించి వేణీనది అనే పేరుతో ప్రవహించి కృష్ణానదిలో సంగమించెను. అదే కృష్ణవేణీ నదిగా పేరుపొందింది.

"కృష్ణా విష్ణుతనుః సాక్షాత్ వేణీ దేవో మహేశ్వరః" అన్న ప్రసిద్ధి యేర్పడింది. "కృష్ణా కృష్ణాంగ సంభూతా" అని కీర్తింపబడింది. కృష్ణవేణి హరిహరాత్మకమయింది. బ్రహ్మదేవుని అంశతో పుట్టిన 'కకుద్మతీ' నది కృష్ణవేణితో కలసి త్రిమూర్త్యాత్మకమయింది. విశాలా, విజయ, వైష్ణవి, మలాపహారిణి, కుముద, కౌశిక, భీమా, తుంగభద్ర ఆదిగాగల దైవాంశగల నదులు ఉపనదులు కావడం వలన కృష్ణవేణి హరిహరాత్మక, త్రిమూర్త్యాత్మక మాత్రమేగాక సర్వదేవతాత్మకమయింది. దేవాంశగల నదులు పూర్వవాహినులయ్యాయి.

దేవతల భార్యల అంశలు కలవి పశ్చిమ వాహినులయ్యాయి. గాయత్రీ స్వర పశ్చిమాభి ముఖ నదీ స్వరూపాలు పొందాయి. ఇది పద్మపురాణంలోని కార్తీకమాహాత్మ్యంలోని కృష్ణానదీ జన్మవృత్తాంతం. బ్రహ్మాండపురాణపు మన్వంతర గణితం ప్రకారం కృష్ణానది 42,89, 84,000 సంవత్సరములకు పూర్వపునాటిదిగా భావింపబడుతోంది. పద్మ మహాపురాణం ఉత్తరఖండం 113 వ అధ్యాయం ప్రకారం కృష్ణానది 9,81,080 సంవత్సరాలకు ముందు పుట్టిందిగా ఊహింపబడుతోంది. ఈ మన్వంతర గణితాలను పురస్కరించుకొని ప్రపంచంలోను, భారత దేశంలోను గల అతి పురాతన, బహు ప్రాచీనమైన నదులలో కృష్ణానది ఒకటిగా పరిగణించవలసి ఉంటుంది. బ్రహ్మాండపురాణం కృష్ణానదిని పేర్కొంది. విష్ణుపురాణం కృష్ణవేణిని పరిగణించింది. భారతం కృష్ణను వర్ణించింది.

"గోదావరీ భీమరథీ కృష్ణవేణీ చ
మంజులా, తుంగభద్రా సుప్రయోగాహ్య
కావేర్యా ఽ థాపిచ దక్షిణాశే ప్రవహా నద్యః
సహ్య పాదాద్వినిస్సృతాః — బ్రహ్మాండపురాణం.
"గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాదికస్తదా
సహ్యపాదోద్భవానద్యః స్మృతాః పాపభయాపహాః"
— విష్ణుపురాణం.

"సదా నిరామయాం కృష్ణాం మందగాం మందగామినీం" కృష్ణను గూర్చి పై విధంగా మహాభారతంలో వేదవ్యాస భగవానుడు వర్ణించాడు. ఇది కృష్ణవేణీనది పౌరాణిక ప్రశస్తి.

మహారాష్ట్రమందలి మహాబలేశ్వరునకు సమీపమందలి కొండల అడుగు భాగాన గల గోముఖాకారం గల ఒక రంధ్రం నేటి కృష్ణానది జన్మస్థానం. సతారాకు సుమారు 5 మైళ్ళదూరంలో వేణీనది కృష్ణలో కలసింది. దీనిని నేడు 'సంగమనా నగరం' అంటున్నారు.

తతో విష్ణు రభూత్ కృష్ణా
వేణీ దేవో మహేశ్వరః
బ్రహ్మా కకుద్మతీ చాఽపి
పృథగే వా చర న్నృప" దివినుండి భువికి దిగిన కృష్ణానది మహిమ ఇది !

# కృష్ణా పుష్కరము

"సహ్యపాదోద్భవా దేవీ శ్రీశైలోత్సంగగామినీ
కృష్ణవేణీతి విఖ్యాతా మమపాపం వ్యపోహతు
సహ్యపాదోద్భవా దేవి కృష్ణవేణీతి విశ్రుతా
సర్వపాప విశుత్యర్థం స్నాస్యే దేవీతి వాంఛసే
శంఖచక్రధరాం దేవీం నీలోత్పలదలప్రభామ్
విష్ణురూపాంతు తాం దేవీం కృష్ణవేణీం నమామ్యహం
శుద్ధస్ఫటిక సంకాశాం ద్విభుజాం పద్మధారిణీం
శివమూర్తిధరాం దేవీం కృష్ణవేణీం నమామ్యహం
విష్ణుపాదోద్భవా గంగా అపరా దేవసంభవా
ఏకత్ర శస్యతే స్నానం పాన మేకత్ర శస్యతే
కృష్ణవేణి నమస్తుభ్యం సర్వపాపప్రణాశిని
భక్త్యా దత్తం మయా దేవి గృహాణార్ఘ్యం సరిద్వరే
విష్ణుదేహసముత్పన్నా శ్రీశైలోత్సంగగామినీ
కృష్ణవేణీతి విఖ్యాతా మమపాపం వ్యపోహతు"

- కృష్ణవేణీ స్తోత్రము.

శ్రీహరి దర్శన, స్పర్శన మాత్రముల చేత మాత్రమే గాక కీర్తన స్మరణముల చేత కూడా తన అంశతో, తన రూపంతో అవతరించిన కృష్ణానది సకల కిల్బిషాలను, సర్వపాప, తాప, శోకాలను హరిస్తుందని, నివారిస్తుందని సృష్టికర్తయైన బ్రహ్మకు అభయమిచ్చాడు. 'కృష్ణ' నామస్మరణం జనులకు అట్టి అపూర్వమైన సత్ఫలితాలను ప్రసాదిస్తుంది. దక్షిణ భారత దేశంలోని పెద్దనదులలో గోదావరి

తరువాత పేర్కొన వలసినది కృష్ణానది. శ్రీ ఆంగీరసనామ సంవత్సర భాద్రపద శుద్ధ పూర్ణిమా శుక్రవారం ది 11-9-1992 న దేవగురు డైన బృహస్పతి కన్యారాశిలో ప్రవేశిస్తాడు. కావున 11-9-92 నుండి 22-9-92 వరకు కృష్ణానదీ పుష్కరం మహావైభవంగా సాగుతుంది. పుష్కర చరిత్ర, కృష్ణాపుష్కర చరిత్ర అవగాహన చేసికొందాము. సింహ, కన్య, తులా రాశులలో గురుడు ప్రవేశించినప్పుడు వరుసగా గోదావరీ, కృష్ణా, కావేరీ మహానదులకు పుష్కరాలు వస్తాయి. దక్షిణ భారతదేశంలో ఉన్న మూడు మహానదులకు ఈ విధంగా వరుసగా పుష్కర యోగం కలగడం దైవ యోగం. దక్షిణాత్యుల భాగ్యం. ఆంధ్రప్రదేశ్ కు చెందిన గోదావరీ, కృష్ణా, తుంగభద్రా నదులు పుష్కరమహానదులు కావడం ఆంధ్రుల అదృష్టం.

పూర్వం తుందిలుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు పరమ నిష్ఠాగరిష్ఠుడు. ముని సమానుడు. పరమ శివుని అనుగ్రహం కోసం తీవ్రమైన తపస్సు కావించాడు. గౌరీ శంకరుడైన గంగాధరుడు తుందిలుని అనుగ్రహించడానికై ప్రత్యక్ష మయ్యాడు. సాక్షాత్కరించిన పరమశివుడు కావలసిన వరం అర్థించమని తుందిలుని ఆదేశించాడు. ఏ భక్తుడూ ఏ దేవతామూర్తినీ అర్థించని చిత్రమైన, అతి విచిత్రమైన వరం తుందిలుడు శివుణ్ణి ప్రసాదింపమని ప్రార్థించాడు. "శివా ! పరమశివా ! హరా ! శంకరా ! ఉమా మహేశ్వరా ! గంగాధరా ! కపాలి, పింగళ, భీమ, విరూపాక్ష, విలోహిత, శాస్త, అజపాద, అహిర్బుధ్న్య, శంభు, చండు, భవ ఆదిగా గల ఏకాదశ రుద్రస్వరూపాలు నీవి. ఓ ఏకాదశ రుద్రస్వరూపా ! నీవు భద్రునిగా నన్ను అనుగ్రహించాలి. నీ రుద్రరూపం వలదు. నీ భద్రరూపం కావాలి. నీవు కంకాళమూర్తి. భిక్షాటనమూర్తి, పుష్కర లేక గంగాధరమూర్తి, కళ్యాణసుందరమూర్తి, వీణాధరమూర్తి,

అర్ధనారీశ్వరమూర్తి, వృషభ రుద్రమూర్తి, హరిహర మూర్తి అనే అష్టమూర్తులతో ప్రకాశిస్తున్నావు. నాకు నీ అష్ట మూర్తులలోని పుష్కరమూర్తిని ప్రసాదించి నన్ను పుష్కరమూర్తిని చేయమని కోరుతున్నాను." అని తుందిలుడు శివుణ్ణి వరం కోరుకొన్నాడు. గంగాధరుడు తుందిలుణ్ణి పుష్కరుణ్ణి కావించాడు. మూడున్నరకోట్ల తీర్థాలకు తీర్థసార్వభౌముణ్ణి కావించాడు. జలసామ్రాజ్య చక్రవర్తిని కావించాడు నదీజలాలకు, తీర్థ జలాలకు పవిత్రతను ప్రసాదించే ఆధిపత్యం, అధికారం సంక్రమింప జేసాడు. ఆ విధంగా తుందిలుడు శివానుగ్రహం మూలంగా పంచ భూతాలలోని జలదేవతకు అధినేతయైన పుష్కరపదవి అలంకరించాడు. తుందిలుణ్ణి శివుడు తన అష్టమమూర్తియైన పుష్కరమూర్తిని చేసి కైలాసానికి తనతో తీసుకొనిపోయాడు. నిత్య శివ సన్నిహితత్వం ప్రసాదించాడు. జలరూపంలో తన కమండలంలో నింపుకొని తన చెంతను నిలుపుకొన్నాడు.

పరబ్రహ్మం నుండి ఆకాశం, ఆకాశంనుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్నినుండి జలం, నీటినుండి నేల, భూమినుండి ఓషధులు, వాని నుండి అన్నం, అన్నం నుండి ప్రాణం పుట్టుతున్నాయని తైత్తిరీయోపనిషత్తు తెలుపుతోంది. ఇదీ సృష్టి. సృష్టికి కావలసింది పుష్టి. పుష్టి కలిగించేది పోషణ. పోషణ చేసేది పుష్కరం. పుష్కరం అంటే పవిత్రమైన జలం సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు సృష్టి ప్రారంభించడానికి – సృష్టికి ప్రాథమిక అవసరమైన పవిత్రపుష్కరజలం సాధించాలని సంకల్పించాడు శివుని ఆధీనంలోని పుష్కరజలం పొందాలంటే శివానుగ్రహం కావాలి అందుచేత వాణీపతి పార్వతీపతి అనుగ్రహం కోసం తపస్సు కావించాడు. చతుర్ముఖుడు చతుర్వేదాలను పశుపతి ప్రీతికోసం పారాయణం కావించాడు. చివరకు సామవేదగానంతో శివుని సుప్రసన్నుని

కావించుకొన్నాడు. ప్రసన్నుడై ప్రత్యక్షమైన పరమశివునికి బ్రహ్మ దేవుడు "శంకరా! సృష్టి ప్రారంభానికి నీ సహకారం అవసరం. పుష్కర సహచర్యం ప్రాణావసరం. అదే నేను కోరే వరం" అంటూ విన్నవించుకొన్నాడు. నివేదించుకొన్నాడు. శివుడు భూమండలాన్ని కమండలం కావించాడు. జలరూపంలోని తుందిలుణ్ణి తీర్థరాజైన పుష్కరుణ్ణి చేసి కమండలంలో నిలిపాడు. వరుణమంత్ర పఠనం కావించి బ్రహ్మకు అనుగ్రహించాడు. బ్రహ్మ స్వీకరించి సృష్టికార్యం నెరవేర్చ సాగాడు.

ఆంగీరస ప్రజాపతిపుత్రుడు దేవగురుడు బృహస్పతి బ్రహ్మను ఉద్దేశించి గొప్ప తపస్సు చేసాడు. బ్రహ్మదేవుడు గురుదేవుని అనుగ్రహించడానికి ప్రత్యక్షమయ్యాడు. "గ్రహాధిపత్యం, సర్వజ్ఞత్వం" పుష్కరున్నిపై సంపూర్ణాధిపత్యం ప్రసాదింపమని గురుడు బ్రహ్మను అర్థించాడు. బ్రహ్మ అంగీకరించి అనుగ్రహించాడు పుష్కరుని గురుని అధీనంలో ఉండమని ఆదేశించాడు. "శ్రీ వాణీపతీ ! మీరే నా సర్వం సర్వస్వం, మీ వియోగం భరించలేను. మీరు నాకు హితులై సన్నిహితులై అనుసరిస్తే మీసన్నిధి పెన్నిధిగా భావించి బృహస్పతితో వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను" అని పుష్కరుడు బ్రహ్మకు విన్నవించుకొన్నాడు. "పుష్కరా ! బృహస్పతి మేషాది ప్రతిరాశిలోను ఒక సంవత్సరం వంతున సంచరిస్తూ పన్నెండు రాశులలో 12 సంవత్సరాలలో సంచారం కావిస్తాడు. గురుడు సంచరించే రాశికి సంబంధించిన నదిలో నీవు గురునితో కలసి ఉండు. గురుడు రాశిలో ప్రవేశించే మొదటి పన్నెండు రోజులు, చివరి పన్నెండు రోజులు, మధ్యకాలంలో ప్రతిరోజు మధ్యాహ్నం రెండు ముహూర్తాలకాలం (96 నిమిషాలు,) సర్వదేవతా

సమేతుడనై గురునితో కలసి నీవుడున్న నదిలో స్నానంచేసి నీకుఅనిసన్ని హితంగా ఉంటాను" అని బ్రహ్మ పుష్కరునకు వాగ్దానం చేసాడు. పుష్కరుని గురునితో అనుసరించడానికి అంగీకరింపజేసాడు.

భారతదేశంలో కాలపరిగణనకు చాంద్రమానం, సౌరమానం బార్హస్పత్యమానం వినియోగింపబడుతున్నాయి. చంద్రగతికి సంబంధించింది చంద్రమానం. సూర్యగతికి సంబంధించినది సౌరమానం. గురుగతిని తెలిపేది బార్హస్పత్యమానం గురుడు ప్రతిరాశిలో ఒక సంవత్సరం ఉంటాడు. ఆ విధంగా గురునకు పన్నెండు రాశుల సంచారానికి 12 సంవత్సరాలు పడుతుంది ఇట్టి గురు సంచారం సమాప్తమైన 12 సం॥ముల కాలానికి పుష్కరంగా పేర్కొంటారు. పుష్కరయోగం గల నదికి ప్రతి పన్నెండు సంవత్సరాలకు ఒక సంవత్సరం పుష్కర సంవత్సరం వస్తుంది. బార్హస్పత్య కాలమాన గణన ప్రకారం కావించుకొనే నదీ మహోత్సవాలకు పుష్కరాలనే వ్యవహార ప్రాచుర్యం యేర్పడింది.

"మేషే గంగా వృషే రేవా (నర్మదా)
మిథునే సరస్వతీ
కర్కాటే యమునా ప్రోక్తా,
సింహే గోదావరీ స్మృతా.
కన్యాయాం కృష్ణవేణీ చ
కావేరీ ఘటకే (తులాయాం) స్మృతా,
వృశ్చికే తామ్రపర్ణీ (భీమా) చ
చాపే పుష్కర (రథ్యా)వాహినీ.
మకరే తుంగభద్రా చ
కుంభే సింధునదీ స్మృతా,
మీనే ప్రణీతా చ నదీ
గురో సంక్రమణే స్మృతా.

పుష్కరాఖ్యో మునీనాం హి
ప్రదేశోఽత్ర బుధైః స్మృతః''

| బృహస్పతి ఒక సంవత్సరం సంచారం కావించే రాశి పేరు. | | పుష్కరం వచ్చే రాశికి సంబంధించిన నది పేరు. |
|---|---|---|
| 1. | మేషం | గంగ |
| 2. | వృషభం | రేవా లేక నర్మదా. |
| 3. | మిథునం | సరస్వతి |
| 4. | కర్కాటకం | యమున |
| 5. | సింహం | గోదావరి |
| 6. | కన్య | కృష్ణవేణి |
| 7. | తుల | కావేరి |
| 8. | వృశ్చికం | తామ్రపర్ణి లేక భీమ |
| 9. | ధనుస్సు | రథ్య లేక పుష్కరవాహిని |
| 10 | మకరం | తుంగభద్ర |
| 11 | కుంభం | సింధునది |
| 12 | మీనం | ప్రణీత లేక ప్రాణహిత |

ఏ రాశిలో గురుడు సంచరిస్తాడో, ఆ రాశికి చెందిన నదిలో గురునితో కలసి తీర్థరాజైన పుష్కర పురుషుడు ఆ రాశిలో ప్రవేశించి మొదటి 12 రోజులు, చివరి 12 రోజులు, మధ్యాహ్నం రెండు ముహూర్తాలకాలం (96 నిముషాలు) అధివశిస్తాడు. త్రిమూర్తులు, ముక్కోటి దేవతలు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, సప్తఋషులు, అష్టదిక్పాలకులు, నవగ్రహాధిపులు, పితృదేవతలు పుష్కర స్నానాలు



చేసి పుష్కర యోగం గల ఆ నదీ తీరంలో పుష్కరకాలంలో నివశిస్తారు. అందుచేత ఆ నదీజలం పరమ పవిత్రమవుతుంది. గురుడు శుభగ్రహం. గోదానం, శివార్చనం ద్వారా సుప్రసన్నుడయ్యే శుభగ్రహామూర్తి బృహస్పతి. గురుదృష్టి అన్ని దోషాలను తొలగించి సకల లాభాలను, శుభాలను ప్రసాదిస్తుంది పరమ తేజోవంతుడైన దేవ గురుడు బుద్ధి, విద్యా, ధన, జ్ఞాన, యోగకారకుడు. సత్ప్రవర్తన, సన్మార్గవర్తన, ధర్మబుద్ధి, త్యాగబుద్ధి వంటి ఉత్తమగుణాలు జీవునకు, జాతకునకు కలగడానికి గురుడు కారకుడు. అట్టి గురుదృష్టి, పుష్కర స్పర్శ, దేవతానుగ్రహం, ఋషుల ఆశీర్వచనం, సర్వ దేవతాగణాల, పితృగణాల సన్నిహితత్వం లభించిన నదీజలం పుష్కర సమయంలో పవిత్రమవుతుంది. పృథివి కన్న జలానికి తేజో శక్తి, కాంతి ఉత్పాదన శక్తి ఎక్కువ. నదీజలాలు విద్యుదుత్పత్తి కేంద్రాలుగా నిలుస్తున్నాయి. సహజ తేజో శక్తి గల నదీజలాలు పుష్కర సమయంలో శక్తి నిలయాలుగా, పుణ్య ప్రసార కేంద్రాలుగా ప్రకాశిస్తాయి. గురు దృష్టితో కూడిన నదీ పుష్కర స్నానం మానవునకు కాంతి, శాంతి, ప్రశాంతి కలిగిస్తుంది. సదవగాహన, దైవ భావన, జ్ఞానసాధన కల్పిస్తుంది.

మానవుడు కావించే స్నానాలు 4 విధాలు. 1. నూతి నీటి స్నానం 2. చెరువులో స్నానం 3. నదీ స్నానం 4. పుష్కర స్నానం. ఈ వాపీ కూప తటాక నదీ స్నానాలు ఒకదానికంటే మరొకటి గుణప్రదమైంది గణనీయమైంది మృత్తికా స్నానం, విభూతి స్నానం వంటివి మనిషి వ్యాధిగ్రస్తుడైనప్పుడు చేసే స్నాన ప్రత్యామ్నాయాలు. మల మూత్ర విసర్జన తరువాత చేసేది కంఠస్నానం. దేవపూజలకు, పితృ దేవతా పూజలకు అవసరమై చేసేవి శిరస్నానాలు. వార స్నానంగా. పండుగ స్నానంగా, పర్వదిన స్నానంగా చేయవలసింది. 'అభ్యంగన

స్నానం' ఏ స్నానమైనా శ్రేష్ఠమైనదే। అన్ని స్నానాలలో నదీ స్నానం శ్రేష్ఠతరం. పుష్కర స్నానం శ్రేష్ఠతమం. పుష్కర దినాలలో ఆ నదీ జలాలను 'ఓజోన్' వంటి అనేక రకాల శక్తి ప్రేరకాలు శక్తివంతం చేస్తాయట. అటువంటి పుష్కర నదీ స్నానం మానవుని శారీరక మానసిక పటుత్వాలను అభివృద్ధిచేస్తుందట. ఆ సమయంలో ఆ నదిపై నుండి ప్రసరించే వాయువును పీలుస్తే ఆయుర్దాయం పెరుగుతుందట. ఆవిధంగా పుష్కరస్నానం శ్రేష్ఠతమమైంది. శ్రీ ఆంగీరసనామ సంవత్సర భాద్రపద శుద్ధ పౌర్ణమీ శుక్రవారంనాడు అంటే 11-9-1992 తేదీన గురుడు కన్యారాశిలో ప్రవేశిస్తున్నాడు. సార్ధత్రికోటితీర్థరాజ సహిత కృష్ణానదీ పుష్కరాలు 12 దినాలు మహా వైభవంగా జరుగుతాయి. గరుత్మంతుడు మాతృ దాస్య విముక్తికై, తల్లి వినత శాప విముక్తికై స్వర్గం నుండి అమృత భాండం కొనివస్తున్నప్పుడు దానిలోని అమృత బిందువులు పడిన నదులన్నీ అమృత బిందు స్పర్శచే అతి పవిత్రములైన తీర్థరాజాలయ్యాయని ఒక పౌరాణిక గాథ ఉంది. ఆ విధంగా ప్రఖ్యాత మైన తీర్థాలలో కృష్ణా గోదావరీ మహానదులు కూడా ఉన్నాయి. అమృత బిందుస్పర్శ భాగ్యం పొందిన కృష్ణవేణీ పుష్కర స్నానం భక్తులకు లభించిన దివ్యమైన వరం !

నర్మదా తీరంలో తపస్సు వలన, గంగా తీరంలో మరణం వలన గోదావరీ తీరంలో తపోదాన మరణాదుల వలన జనులు తరిస్తారు. ఉత్తర భారతదేశంలోని గంగానది, దక్షిణ భారత దేశంలోని కృష్ణవేణీనది మాత్రమే దర్శన, స్పర్శన, కీర్తనాదుల వలన నరులను తరింపజేస్తాయి అని పురాణాలు ప్రకటిస్తున్నాయి. ఈ రెండు నదుల విషయంలో ఒక విశేషం ఉంది. గంగానది అందరి పాపాలను హరిస్తుంది. కాని తనకు సంక్రమించిన పాపాన్ని మాత్రం తొలగించుకొనలేనిది. ఇతరుల పాపా

లనే కాదు, తన పాపాలను నిర్మూలించుకొనే విశిష్టమైన సామర్థ్యం కలది కృష్ణావేణీనది. గంగాతీరంలోని ఒక విప్రవనిత నిత్య వ్యభిచారిణియై నిత్య గంగాస్నానం ద్వారా నిత్య వ్యభిచారదోషం తొలగించుకొనేదట. ఆ వ్యభిచారిణి పాపం గంగకు సంక్రమించగా దాన్ని హరింపజేసికొనలేక పోయిందట. కాగా గంగ నిత్యం వాయస (కాకి) రూపం పొంది కృష్ణలో స్నానంచేసి తన పాపం హరింపజేసికొని హంస రూపంతో స్వస్థానం చేరుకొనేదట. ఇది కృష్ణా మాహాత్మ్యాం వివరించే ఒక కథ. కృష్ణకు చెందిన హంసలదీవి కథ కూడా ఇదే!

యత్స్పర్శ పుణ్యోఽహరహరః ప్రవృద్ధం
పాపం జనానాం విధునోతి వాయుః
ధ్వాంతం యథార్కో జగతాం వివృద్ధ
స్తాం విస్తరాత్ వర్ణయితుం ఈశః
నైతచ్ఛ్రత మితి ప్రోచుః
తత్త్వజ్ఞా స్తు మహర్షయః
కృష్ణం చ కృష్ణవేణీం చ
శితానాం కిన్ను దుర్లభమ్
జపో దానం తపో హోమః
శ్రాద్ధం సద్గురు సేవనం
అక్షయంతు భవే దత్ర
పాపం చాపి వినశ్యతి"

కృష్ణానది మహాబలేశ్వరం నుండి శ్రీశైలంవరకు గంగానదితో సమానమైంది. అచ్చటనుండి సాగరసంగమంవరకు నూరురెట్లు ఫలవంతమైంది. సహ్య పర్వతంనుండి సాగరం వరకూ కృష్ణానది

రెండుతీరాల వెంట యోజన పర్యంతం మోక్షప్రదమైన క్షేత్రంగా ప్రకటింపబడింది. స్వప్నంలోని క్లేశాలు మేల్కొన్న ప్పుడు బాధింపవు. కృష్ణానది మహిమ గ్రహించినవారిని మాయగాని, లోకమాయకు చెందిన కష్టాలుగాని బాధింపవు. కాగా కృష్ణపైనుండి వీచే గాలి సూర్యరశ్మి చీకటిని తొలగించినట్లు పాపాలను నాశనం చేస్తుంది. కృష్ణ సర్వం ప్రసాదిస్తుంది. ముక్తి ఇవ్వడంలో ఆశ్చర్యం ఏమిటి ? కృష్ణాతీరంలోని జప, హోమ, తప, దాన, సద్గురు సేవాదులు అనంత పాప సముదాయాలను నిర్మూలించి అక్షయ ఫలితాలు కలిగిస్తాయి.

"కృష్ణాయా సలిలే స్నానం
దేవాన మపి దుర్లభమ్
జన్మ సాహస్ర సంచితమ్
గ్రామే వా యది వాఽరణ్యే
గిరౌ యత్ర చ తత్ర వా
కృష్ణవేణాంభసి స్నాతో
వాజపేయ ఫలం లభేత్"

కృష్ణానదీస్నానం దేవతలకైనా దుర్లభం. వేయిజన్మల పాపమైనా కృష్ణానదిలో చేసే భక్తిపురస్సరమైన ఒకస్నానంతో నశిస్తుంది. కృష్ణానది ప్రవహించే గ్రామ, అరణ్య, పర్వత ప్రాంతాలలో విధి విధానంగా చేసే కృష్ణానదీస్నానం వాజపేయ ఫలిత జేస్తుంది. అంతేకాదు కృష్ణానదీ ప్రవాహ స్నానం [illegible]ఆవుల దానఫలం (శతధేను ఫలం) కలుగజేస్తుంది. కోసం దేవతలు మానవులుగా పుట్టాలని

[illegible]

"కృష్ణాతరంగ సంభూత
పవన స్పర్శ మాత్రతః
నిర్ధూత పాతకాః సర్వే
జనా విష్ణుపదం యయుః
తటస్థ ముద్ధృతం క్షిప్తం
జాతు స్పృశతి వాయునా
కృష్ణవేణీ జలం హంతి
పాపం జన్మ శతార్జితమ్."

పావన కృష్ణా తరంగ వాయువులు సోకిన నరుడు సర్వపాప హరుడై శ్రీహరివాసం పొందుతాడు. గాలివలన ఎగిరిన కృష్ణానది యొక్క తుంపురుల తాకిడి ఏ నరునకు కలుగుతుందో ఆ నరుని నూరు జన్మల పాపాలు హరిస్తాయి. ఇది కృష్ణవేణిపై ప్రసరించే వాయువుల దివ్య ప్రభావం.

బ్రహ్మజ్ఞానం గయాశ్రాద్ధం
దానం చ కురు జాంగలే
కృష్ణవేణీ పయః పానం
సమ మేత చ్చతుష్టయమ్"

బ్రహ్మ జ్ఞానికావడం, గయలో శ్రాద్ధం చేయడం, కురుక్షేత్రంలో దానం కావించడం, కృష్ణవేణీ జలపానం చేయడం సమానమైన సత్కార్యాలు. కృష్ణవేణీ నదీజలాలలో స్నానం చేయడం వలన కృష్ణవేణిపై వీచేగాలులు పీల్చడంవలన, కృష్ణవేణీజలాలు పానం చేయడం వలన ఇట్టి మహత్తరమైన దివ్య ఫలాలు లభిస్తాయి.

'భూతలే యాని తీర్థాని
తాని కన్యాగతే గురౌ
ఆయాంతి కృష్ణవేణీం తు
మహాపుణ్య ఫలాని చ
బ్రహ్మా విష్ణు శ్చ రుద్రశ్చ
ఇంద్రాద్యా స్సర్వ దేవతాః
పితరో ఋషయ శ్చైవ
తత్రైవ నివసంతి హి
షష్టిర్వర్ష సహస్రాణి
భాగీరథ్యావ గాహనమ్
కృష్ణవేణీ నదీ స్నానం
సమం కన్యాగతే రవౌ
కన్యాగతే గురౌ యద్యే
త్సప్తకోట్యఘ నాశనమ్
స్నాన మాత్రేణ సర్వేషాం
తావ త్పుణ్య వివర్ధనమ్
కృష్ణాయాః పుష్కరే కృత్వా
స్నానం దానం చ పైతృకమ్
గయాయాం కోటి గుణితం
ఫల మాప్నోతి మానవః"

గురుడు కన్యారాశిలో ఉన్నప్పుడు పుడమిలోని పవిత్ర తీర్థాలన్నీ కృష్ణానదిని ఆశ్రయిస్తాయి. త్రిమూర్తులు, ఇంద్రాది సకలదేవతలు, ఋషులు అందరూ కృష్ణానదీతీరంలో నివశిస్తారు. రవి కన్యలో ఉన్నపుడు కృష్ణానదీస్నానం 60 వేల సంవత్సరాల గంగానదీ స్నాన ఫలం ప్రసాదిస్తుంది. ప్రతి సంవత్సరం రవి కన్యలో ప్రవేశించినప్పుడు

కృష్ణానదీ స్నానం అంతటి పుణ్యఫలం ఇస్తూంటే 12 సంవత్సరాలకు గురుడు కన్యారాశిలో ప్రవేశించినప్పుడు కృష్ణానదీ పుష్కరస్నానం ఎంతటి అనంత పుణ్యఫలం భక్తులకు సన్నిహితం చేస్తుందో పరిగణించడం సాధ్యమా ? వర్ణించడం సాధ్యమా ?

గురుడు కన్యారాశిలో సంచారం కావిస్తూన్న పవిత్ర సమయంలో కృష్ణానదిలో చేసే ఒక స్నానం మూలంగా జనుడు ఏడుకోట్ల జన్మల పాపాలను సహితం హరింపజేసికొన గలుగుతాడు. కృష్ణవేణీ పుష్కర సమయంలో భక్తి ప్రపత్తులతో, శ్రద్ధాభక్తులతో చేసిన స్నాన, దాన పితృముక్తిహేతు సాధనలు గయలో చేసిన వానికన్న కోటిగుణితమైన ఫలాలను లభింపజేస్తాయి.

"తీర్థం కృష్ణానదీ యత్ర క్షేత్రం పాశుపతం మహత్
దైవతౌ యత్ర వై స్వర్ణః దుర్గాంబా మల్లికార్జునౌ"
"కృష్ణవేణ్ణా తరంగిణి యంధ్రలక్ష్మి ని
త్య తరంగ తాండవంబాడు చోటు
పాశుపతాస్త్రంబు భవునిచే విజయుండు
ఘన తపస్ఫూర్తి గైకొనిన చోటు
భక్తుల పాలి కల్పకశాఖి కనక దు
ర్గాంబిక కాస్థానమైన చోటు
బహు మహామహులద్రి గుహాలలో వసియించి
నిర్వికల్ప సమాధి నెగడు చోటు
నాడు నేడును సిరుల దనర్చు చోటు
ఆంధ్రభూనాభి దేశమై యలరు చోటు
పావన చరిత్రమును వారిలు ప్రోలుగల్గి
వెలయు ప్రజతోడ కలదుగా విజయవాడ

—దివ్యదర్శనము.

శ్రీ కనకదుర్గామల్లేశ్వరులు ఆవిర్భవించిన దివ్యక్షేత్రం విజయవాడ. నిత్యం యాత్రికులు కృష్ణమ్మలో స్నానంచేసి దుర్గమ్మను చూస్తూంటారు. విజయవాడ కనకదుర్గా క్షేత్ర పవిత్రతను ఇంద్రకీలాద్రి పర్వతం, శతాధికం చేస్తోంది. కృష్ణానది సహస్రాధికం కావిస్తోంది. అర్జునుడు తపస్సుచేసి పశుపతిని మెప్పించి పాశుపతాస్త్రం పొందింది కృష్ణానదీ తీరంలో ఇంద్రకీలాద్రి పర్వతంపైన. కృష్ణమ్మను సేవిస్తే కాని తనను దర్శించి, పూజించడానికి అనుమతించదు విజయవాడ కనక దుర్గమ్మ. ''కన్యాగతే దేవగురౌ, సార్ధత్రికోటి తీర్ధ సహిత, పుష్కర పరియుక్తా మహాపర్వాణి పుణ్యకాలే, కృష్ణవేణీ స్నానమహం కరిష్యే" అని సంకల్పం చెప్పుకొని కృష్ణాపుష్కరస్నానం కావించుదాము.

''విష్ణు పాదోద్భవా గంగా అపరా దేహ సంభవా
ఏకత్రిస్య తే స్నానం పానం కత్రిస్య తే
కృష్ణవేణి నమస్తుభ్యం సర్వపాపవినాశనీ
భక్త్యాం దత్తమయా దేవి గృహాణార్ఘ్యం సరిద్వరే
విష్ణుదేహా త్సముత్పన్నా శ్రీశైలా త్సంగగామినీ
కృష్ణవేణీతి విఖ్యాతా మమ పాపం వ్యపోహతు''

ఈవిధంగా కృష్ణాపుష్కరస్నానంచేసి విజయవాడ కనకదుర్గమ్మను సేవిద్దాము జై కృష్ణవేణీవాహినీ ! జై కనకదుర్గా భవానీ !

# పుష్కర విధానం

"కన్యాగతే గురౌ యద్వత్స ప్తకోట్యఘనాశనం
స్నానమాత్రేణ సర్వేషాం తావత్పుణ్య వివర్ధనం
భూతలే యానితీర్థాని తాని కన్యాగతే గురౌ
ఆయాంతి కృష్ణవేణీంతు మహాపుణ్య ఫలాయ చ
బ్రహ్మ విష్ణు రుద్రశ్చ ఇంద్రాద్యా స్సర్వదేవతాః
పితరో ఋషయశ్చైవ తత్రైవ నివసంతి హి
కృష్ణాయాః పుష్కరే కృత్వా స్నానం దానం చ పైతృకం
గంగాయాః కోటిగుణితం ఫలమాప్నోతి మానవః
యస్యాం తిథౌ గురుర్యాతి కన్యయా చ సమాగమం
కృష్ణాయాంతు తదా స్నానం ప్రయత్నేన సమాచరేత్"

శ్రీ కృష్ణవేణీ పుష్కర స్నానం ఏడు ఏడుజన్మల ఏడుకోట్ల పాపాలను తొలగించి కోటికోటిపుణ్యాలను కలగజేస్తుంది. సర్వదేవతా సన్నిహితమైన కృష్ణలో సర్వప్రయత్నాలుచేసి విధిగా పుష్కర స్నానం చేయాలి. పుష్కరవిధులు నిర్వర్తించాలి. 'పుణాతిశుభంకరోతి ఇతిపుణ్యం' అని అమరకోశ వివరణం. దేహానికి, ఆత్మకు, దేహాత్మలను అనుసంధానంచేసే మనస్సుకు శుభప్రదమైనసంస్కారం సన్నిహితం చేసే అనుభూతి పుణ్యం. అట్టి పుణ్యానుభూతిని పుష్కలంగా ప్రసాదించేది పుష్కరం.

పూర్వకాలంలో సౌవీరదేశాన్ని సుమతి అనేరాజు పాలించేవాడు. అతని ఏకైకపుత్రుడు చిత్రరథుడు. కృత్స్నమదుడు అనే మహర్షి కృష్ణాపుష్కరయాత్రకు బయలుదేరి మార్గమధ్యంలో సౌవీరదేశంలో మకాంచేశాడు. ఆ ముక్షిని సుమతి అనేరాజు ఆహ్వానించి యథోచిత అతిథిపూజ చేసి తన ఏకైకపుత్రుని జాతకం పరిశీలిం

పమని ప్రార్థించాడు. జాతకం సాధారణ దృష్టితో చూచాడు. తరువాత దివ్య దృష్టితో విషయం గ్రహించాడు.

"పూర్వం చోళదేశంలో **సుధర్ముడు** అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికుమారుడు సుశర్మ. సుశర్మ వేదవేదాంగ పారంగతుడు. **సుధర్ముడు** తల్లి బాధ్యత సుశర్మకు అప్పగించి తామ్రపర్ణీనదీతీరానికి వెళ్ళి యోగసిద్ధిపొంది ముక్తుడయ్యాడు. తల్లి సుఖజీవనానికి పాటుపడే సుశర్మ కృషికి భార్యమూలంగా అంతరాయం కలిగింది. తల్లికి ఇల్లాలుకి మధ్య యేర్పడిన కలహం మూలంగా తల్లిని ఇంటినుండి సుశర్మ వెడలగొట్టాడు. తల్లివ్యాధితో, వృద్ధాప్యంతో అనాథగా తుదిశ్వాస వదిలింది. మాతృపీడా పాపంమూలంగా సుశర్మ మరణించాడు. ఇతర పుణ్యవిశేషం మూలంగా చిత్రరథుడనే నీ కుమారుడుగా జన్మించాడు. మాతృపీడా దోషంమూలంగా చిత్రరథుడు అల్పాయుష్మంతుడయ్యాడు. ఇక మూడు మాసములతో ఆ కాలమృత్యువు పాలవుతాడు" అని కృత్స్నమద మహాముని సుమతికి వివరించాడు. సుమతి మునిని తనకు పుత్రభిక్ష అనుగ్రహించమని అర్థించాడు.

"కల్పోక్త ప్రకారం కృష్ణాపుష్కర వ్రతాచరణం మాత్రమే నీ పుత్రునికి దీర్ఘాయువు స్తుంది. రాజా! నీవు వెంటనే పుష్కర దీక్షవహించి నీ కుమారునితో కృష్ణానదిని సమీపించి కల్పోక్త ప్రకారం పుష్కర వ్రతం ఆచరించి నీవ్కైక పుత్రుని అపమృత్యువునుండి రక్షించుకొనుము. పుష్కరవ్రతం 12 రోజులు చేయడం ముఖ్యమైన కల్పం. 12 రోజుల పుష్కరవిధులు ఒకరోజులోనే ముగించే అత్యవసరకల్పం కూడా ఉంది. నీ కుమారుని ఆయువు అతిస్వల్పంగా ఉంది. మహారాజువైన నీవు 12 రోజుల పుష్కర వ్రతకల్పం ఒకరోజులో ముగించి నీపుత్రునిశతాయు

ష్ఠంతో కావించుకోనమః” కృత్స్న మదముని రాజు సుమతికి ఉపదేశిం చాడు. సుమతి తనకుమారుడైన చిత్రరథుడితో యథాశాస్త్రీయంగా, విధివిధానంగా కల్పోక్త కృష్ణాపుష్కరవ్రతం ఆచరించి పుత్రుడి అకాల మృత్యువునుండి రక్షించుకొన్నాడు. కృష్ణాపుష్కరవ్రతం అకాల మృత్యు భయాలను, అపమృత్యు దోషాలను నివారించి ఇష్టకామ్యార్థ సిద్ధులను, సముచిత సర్వసుఖాలను, సకలశుభాలను, కలుగజేస్తుంది.

అతి ప్రధానమైన కృష్ణాపుష్కరవ్రతవిధులు మనం అవగాహనచేసి కొని ఆచరణలో పెట్టాలి కల్పోక్త కృష్ణాపుష్కరవ్రతాచరణం ద్వారా ధర్మాచరణం, ధర్మాచరణంద్వార ఆత్మకల్యాణం, సమాజకల్యాణం రాష్ట్ర, దేశలోక కల్యాణపరంపరలు పొందుదాము. ధార్మిక జీవనం సఫలం కావించుకోవడానికి, మనకు లభించిన ఒక అపూర్వమైన అవ కాశం కృష్ణాపుష్కరం. ఇది ప్రతి 12 సంవత్సరాలకు ఒకసారి వచ్చే ఒక పవిత్రనదీ మహోత్సవం. నిత్యం మనం కావించేస్నాన, దాన, జప, దేవతారాధనలకు పుష్కర పవిత్ర పర్వసమయం సహస్రాధిక ఫలి తాలను సమకూరుస్తుంది. పుష్కర విధులలో సర్వులూ విధిగా ఆచరిం చవలసింది సంకల్పపూర్వకమైన స్నానం. ఋగ్వేదం, తైత్తిరీయ సంహిత, అథర్వణవేదం అన్నీ జలప్రశంసలు, నదీజలప్రశంసలు కావిం చాయి. 'ఆపోవా ఇదగ్ంసర్వం' అనిశ్రుతివాక్యం. 'అపఏవససర్జాదౌ' అంటే 'జలాన్నే మొదట సృష్టించెను అని శ్రుతిచెప్తోంది. సర్వానికి మూలం జలం. దేహాన్ని శుభ్రపరచడం- దాహాన్ని తీర్చడం జలం కావించే ప్రాథమిక విధులు.

'మేధ్యం', 'యజ్ఞం' అనే పవిత్ర విధులను కూడా జలం నిర్వహిస్తోంది. 'మేధ్యం' అనే జలశక్తి స్నాన, ఆచమనాలు చేసిన జనుల పాపా లను హరిస్తుంది. 'యజ్ఞం 'అనే జలశక్తి ప్రోక్షణ ద్వారా ద్రవ్యశుద్ధికి దోహదం చేస్తుంది. జలం కల్పించే ప్రాథమిక విధులను అమలు

చేస్తోంది. కనివించని పవిత్ర విధులను అమలు చేస్తోంది. ఇట్టి అపూర్వమైన మహిమ కలిగిన జలంలో కృష్ణానదీపుష్కర పవిత్ర జలంలో స్నానం చేయడం ముక్తిహేతువని బ్రహ్మాండ పురాణం శాసిస్తోంది. కృష్ణాపుష్కరస్నానం మూడుకోట్ల యాభై లక్షల దివ్యతీర్థాలలో చేసిన అపూర్వమైన అమృత ఫలితాన్ని అనుగ్రహిస్తుంది. పుష్కరస్నానం ప్రభాత సమయంలో చేయడం ఉత్తమం. మధ్యాహ్న స్నానం మధ్యమం. అపరాహ్ణ స్నానం అధమం. సంకల్పపూర్వకంగా సుప్రభాతసమయంలో కృష్ణాపుష్కరస్నానం చేయడం శుభప్రదం. పుణ్యప్రదం.

పుష్కరస్నానం తరువాత మార్తాండునకు, కృష్ణవేణీనదికి, సరస్వతీ సహిత బ్రహ్మదేవునకు, గౌరీశంకరులకు, లక్ష్మీనారాయణులకు, తీర్థరాజైన పుష్కరునకు తారాసహితబృహస్పతికి, ఇంద్రునకు వాలఖిల్యాది సప్తఋషులకు పితృదేవతలకు, సనకాది మహాజనులకు భక్తిప్రపత్తులతో యథావిధిగా దోసిళ్ళతో అర్ఘ్యప్రధానం కావించాలి. 'కృష్ణాపుష్కరమహాకల్పం' లోని కృష్ణానదీ అష్టోత్తరశతనామాలతో కృష్ణవేణీప్రతిమకు షోడశోపచారలతో పూజకావించాలి. కృష్ణవేణీ పూజపిమ్మట దేవగురుడైన బృహస్పతిని, తీర్థరాజైన పుష్కరునికూడా షోడశోపచారాలతోను అష్టోత్తరశతనామాలతోను భక్తిపురస్సరంగా పూజకావించాలి. ఆ విధంగా కృష్ణాపుష్కర యాత్రికుడు కృష్ణా, గురు, పుష్కరపూజలు కావించి కృష్ణానదీమాత, బృహస్పతి, పుష్కరుల అనుగ్రహానికి పాత్రులు కావాలి. పుష్కరస్నాన కల్పం నిర్దేశించిన విధంగా స్నానం, అర్ఘ్యప్రదానం, నదీగ్రహ, పుష్కరదేవతారాధనం కావించడం సంపూర్ణ కృష్ణాపుష్కర స్నానఫలితం భక్తునకు సమకూరుస్తుంది.

పుష్కర స్నానం పిమ్మట పుష్కర సమయదానాలకు ప్రాము

ఖ్యం పొందింది. అహంకార, మమకారాలతో ఆర్జించిన దానిని ఉపకార భావంతో, సహకార సేవా దృక్పథంతో త్యజించే సాధనం దానం. దానం దాతను, ప్రతిగ్రహీతను ధన్యం చేస్తుంది. ధనవ్యామోహం, వస్తువాహన వ్యామోహంనుండివిముక్తి కలిగిస్తుంది, ఆర్జించిందిత్యజించడంలో నిస్వార్థం, నిర్మోహత్వం, నిరాడంబరత్వం అలవడుతాయి. దుష్ట సంపాదనం, దుష్టజీవనం నుండి దానం మానవుని దూరం చేస్తుంది శాస్త్రం నిర్దేశించిన పుష్కర కల్పం విధించిన దానవిధులు కృష్ణా పుష్కర యాత్రికులు నిర్వహించడం శ్రేయస్కరం.

పుష్కర దినాలలో మొదటి రోజున బంగారం, వెండి, ధాన్యం, భూమి దానం చేయాలి. బంగారం వెండి దానం చేయడం వలన ఇహ లోక సుఖభోగాలతో పాటు సూర్యచంద్ర లోకాలప్రాప్తి కలుగుతుంది. భూదానం వలన భూపతిత్వం వస్తుంది. ధాన్య దానం కుబేరసంపద కలిగిస్తుంది.

రెండవ రోజున గో, వస్త్ర, రత్న, లవణ దానాలు చేయాలి. గోదానం వలన రుద్రలోక ప్రాప్తి, వస్త్రదానం వలన వసులోక ప్రాప్తి, రత్న దానం వలన సార్వభౌమత్వం, లవణ దానం వలన లావణ్యం కలుగుతాయి.

మూడవ రోజున శాక, ఫల, గుడ, అశ్వ దానాలు కావించాలి. కుబేర, అశ్వనీ దేవతాలోక సౌఖ్యాలు అనుభవించి, ఇంద్ర సమాన వైభవం పొందుతాడు.

నాలగవరోజున పాలు, తేనె, నెయ్యి, నూనెదానంచేయాలి క్షీర దానం సిరిసంపదలు, తేజస్సు కలిగిస్తుంది. తేనె దానం చేయడంవలన

వైకుంఠనగర ప్రవేశం కలుగుతుంది. ఘృతదానం ఆయుష్షును పెంచుతుంది. తైల దానం నరకనివారకం.

అయిదవ రోజున ధాన్యం, బండి, గేదె, ఎద్దులను దానంగా ఇవ్వాలి. ఈ దానాలవలన దివ్యమైన భోగభాగ్యాలతో కైలాస నివాసం కలుగుతుంది.

ఆరవరోజున అగరు,కస్తూరి,చందన దానాలు చేయాలి. ఔషధ దానం అంటే వట్టి వేరు, జాజికాయ, జాపత్రి, కరక్కాయ వంటివానిని దానంచేయాలి. ఆరోగ్యం, భాగ్యం, లక్ష్మీకటాక్షం కలిగి ఇంద్ర, చంద్ర, గంధర్వ లోకనివాస సులభమవుతుంది.

ఏడవ రోజున గృహ,పీఠ,శయ్యా, ఆందోళికా (పల్లకీ) దానాలు చేయాలి. దీనివలన చిరకాలసౌఖ్యం, అమరత్వం, మారు జన్మలో ప్రభుత్వ అధికారం వస్తాయి.

ఎనిమిదవ రోజున గంధ, దారు, పుష్పమాలా దానాలు చేస్తే ఇంద్రలోకంలో దివ్యమైన సుఖాలు ప్రాప్తిస్తాయి.

తొమ్మిదవ రోజున పిండప్రదానం, పితృదేవతారాధనం చేయాలి. దాసీ, శయ్యా, కంబళదానాలు ఇవ్వాలి. పితృదేవతల అనుగ్రహం వలన వంశవృద్ధి, సత్సంతానసిద్ధి జరుగుతుంది. దాసీ, శయ్యా, కంబళదానాలు సర్వభాగ్యాలు, స్వర్గసుఖాలు అందిస్తాయి.

పదియవ రోజున శాక, సాలగ్రామ, పుస్తక దానాలు, వెండి, ముత్యం లోహపు గొలుసులు మొదలగుదానాలు చెప్పబడ్డాయి. సాలగ్రమదానం భూమండలదానఫలితం కలిగిస్తుంది. శాక, పుస్తక,

రజిత, మౌక్తిక, లోహ దానాలు అక్షయ పుణ్యలోకాలను సన్నిహితం చేస్తాయి.

**పదకొండవ రోజున కావించే గజతురగాది దానాలు వైకుంఠ లోక ప్రవేశం, కలిగిస్తాయి.**

పండ్రెండవ దినాన చేసే తిల, అజ (మేక) దానాలు సర్వ ఆపదలను నివారిస్తాయి. ఆనాడు ప్రత్యామ్నాయం లేకుండా సాలగ్రామ దానం చేయాలి. పుష్కర విధ్యుక్త స్నానం చేసి షోడశదానాలు చేయాలి. ఆవు, బంగారం, వెండి, గేదె, రత్నాలు, పుస్తకాలు, ప్రత్తి, ఏనుగు, గుఱ్ఱం, దాసీ, గ్రాసు, ఇల్లు, తేనె, మేక, శయ్య, కన్య ఆదిగా గల దానాలు షోడశదానాలు. ఆర్థిక, ఇతర పరిస్థితుల దృష్ట్యా పై దానాలు కావించడానికి శక్తి, అవకాశంలేని వారు ఆ దానాలకు ప్రత్యామ్నాయంగా యథాశక్తి మనస్సంకల్పిత దక్షిణను సమర్పించడం ద్వారా అభీష్ట సిద్ధిని పొందవచ్చును.

"యశ్శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామకారకః
న ససిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థౌ
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మ కర్తు మిహార్హసి"

శ్రీకృష్ణుడు "శాస్త్ర విధిని విడచి వ్యవహరించేవాడు సిద్ధిపొందలేడు. సుఖంకాని, స్వర్గమోక్షాలుకాని అందుకోలేడు. విధినిషేధాలు గ్రహించాలి. శాస్త్రంప్రమాణం, శాస్త్రం విధించే కర్మలనే ఆచరించాలి. కర్మల్ని శాస్త్ర ప్రకారంచేయాలి" అని అర్జునునకు ఉపదేశించాడు. శాస్త్రం ఆదేశించిన కర్మలలో పితృదేవతారాధనం ఒకటి.

భీష్ముడు గయలో పితృశ్రాద్ధం పెట్టాడు. పిండప్రదాన సమయంలో తండ్రి శంతనమహారాజు చేయి రత్నకంకణాలంకృతమై పిండం అందుకోవడానికి వచ్చింది. శాస్త్రధర్మప్రకారం పిండాలు దర్భలపై ఉంచాలి. భీష్ముడు శాస్త్రవిధేయుడై పిండాలను దర్భలపై ఉంచాడు కాని తండ్రి శంతనమహారాజు చేతిలో ఉంచలేదు. శాస్త్రసమ్మతంగా కర్మ చేసి భీష్ముడు మనకు ఆదర్శప్రాయుడు, అనుసరణీయుడు అయాడు.

పుట్టిన ప్రతి మానవుడు దేవ, ఋషి, పితృ ఋణాలు తీర్చుకోవాలి. శ్రాద్ధకర్మలు ఆచరించడం ద్వారా పితృఋణం తీరుతుంది. ప్రతిభారతీయుడు నిత్యం బ్రహ్మ, దేవ, పితృ, మనుష్య, భూతయజ్ఞాలు అనే పంచమహాయజ్ఞాలు ఆచరించాలి. పితృ మహాయజ్ఞ రూపంలో పితృఋణం తీర్చుకోవాలి. పుష్కర సమయంలో నదిలో దేవతలు పితరుల్ని నరుల్ని అనుగ్రహించడానికి అధివసించి ఉంటారు. నదీతీరంలో పితృదేవతలు తమవంశీకులు కావించే పితృదేవతార్చనలు అందుకొని, దేవతల దీవనలు సమకూర్చుకొని ఉత్తమ గతులు, ఉత్తర గతులు పొందడానికి నిరీక్షిస్తుంటారు శాస్త్రం పుష్కర సమయంలో పితృయజ్ఞం కావించడం, తర్పణాలు వదలడం, పిండ ప్రదానాలు చేయడం, తీర్థవిధులు నిర్వహించడం నిర్దేశించింది. పుష్కర సమయంలో మొదటిరోజున హిరణ్య శ్రాద్ధం, 9వ రోజున అన్నశ్రాద్ధం, 12వ రోజున ఆమశ్రాద్ధాలు ముఖ్యంగా ఆచరించాలి. అలా సాధ్యం కానివారు పుష్కరాలలో 9వ రోజున తీర్థశ్రాద్ధం జరుపుకోవడం ముఖ్యం. కానిపక్షంలో పితృదేవతల పుణ్యతిథినాడుగాని, లేకపోతే 12 రోజులలో ఏదో ఒక రోజున కాని తీర్థవిధులు నిర్వహించాలి. మాతృ, పితృవర్గాలకు మాతామహ వర్గత్రయానికి భ్రాతృ, పితృ

భగినీ, భావుక, శ్వశుర, స్యాలక, గురు, రిక్థి ఆదిగా గలవారికి మరణించిన బంధుసంబంధులకు పిండప్రదానం పుష్కరసమయంలో చేయాలి. మిత్రులకు, సేవకులకు, ఆశ్రితులకు, విష, అగ్ని, జల ఆదిగా అంశాలమూలంగా బలాత్కారమరణం పొందినవారికి, క్షయ కుష్ఠాది రోగాల పాలై చనిపోయిన వారికి, అనాథులకు, వికలాంగులకు, కర్మ, ధర్మ భ్రష్టులకు, హంతకులకు, మహాపాపాత్ములకు "ధర్మ పిండప్రదానం" కావింబడుతుంది. ఆ విధంగా వారికి ఉత్తర ఉత్తమగతి కలగడానికి పుష్కరసమయంలోని ధర్మ పిండ ప్రదానం దోహదం చేస్తుంది. జన్మించి జీవించే జనులకు సుఖాలు, శుభాలు, కలిగించడానికి, అందరు మృతజీవులకు అమృతత్వం అందించడానికి పుష్కర సమయం దోహదం చేస్తుంది.

అసలు శ్రాద్ధ అంటే ఏమిటి? "శ్రద్ధయా కురుతే కర్మ శ్రాద్ధమిత్య భిధీయతే" అన్నది శ్రాద్ధనిర్వచనం. శ్రద్ధతో చేసే ప్రతి కర్మ శ్రాద్ధమవుతుంది. పితృదేవతలకు సమర్పించే పిండప్రదానానికి శ్రాద్ధం అని రూఢి యేర్పడింది.

శ్రీకృష్ణుడు జాంబవంతుని గుహాలోకి వెళ్ళి వారం రోజుల వరకు బయటకు రాలేదు. శ్రీకృష్ణుడు మరణించాడని ద్వారకావాసులు అపోహపడి శ్రాద్ధం పెట్టారుట. జాంబవంతునితో పోరాడుతున్న నీరసించిన శ్రీకృష్ణునకు శ్రాద్ధఆహారం వలన బలంవచ్చి అతణ్ణి అణచగలిగాడు మనం ఎవరిని ఉద్దేశించి తద్దినం నాడు ఆహారం సమర్పిస్తున్నామో వారికి అందుతుందని శాస్త్రం వక్కాణిస్తోంది తరతి తరాలా పద్ధతిలో ఉంచిన నమ్మకాన్ని శ్రాద్ధకర్మ విషయంలో కూడ ప్రదర్శించడం అవసరం "పశ్చిమ దేశవాసులు కూడా చనిపోయిన ఆత్మీయులతో ఒకగంట సేపు సన్నిహిత సంబంధం కావాలని—

ఆ అనుభవంకోసం ఎదురుచూస్తుంటారుట. అట్టి పితృదేవతల సన్నిహిత సంబంధం పొందినవాడు ఆరోగ్యవంతుడవుతాడు. సహృదయుడవుతాడు. సక్రమ ఆలోచనా సరళి కలవాడవుతాడు. ప్రేమ స్వరూపుడవుతాడు." ఇది మహాకవి టెన్నిసన్ భావన. పితృదేవతల సన్నిహిత సంబంధం గూర్చిన టెన్నిసన్ మహాకవి తీవ్రమైన తపన ఇది. ప్రతిసంవత్సరం నవంబరు 7వ తేదీన **'All souls day'** జరిపి క్రైస్తవమతస్థులు దేహంవిడచిన వారికి తద్దినాలు పెడతారు. మృతుల గోరీల వద్ద భక్తిశ్రద్ధలతో పుష్పాలు, తినుబండారాలు సమర్పిస్తారు. పిల్లల గోరీలవద్ద ఆటవస్తువులు, బొమ్మలు, ఊయలలు అర్పిస్తారు. హిందువుల శ్రాద్ధ కర్మలు వివిధ మతసంప్రదాయాలలో ఏదో ఒక రూపంలో అమలు జరుగుతున్నాయి. యూదు, ఇస్లాము మత విధానాలలో సహితం మృతుల ఆరాధన ఉంది.

"దేహం తల్లి గర్భంలో కుండలాగా తయారు చేయబడుతుంది. దాన్ని తయారు చేసుకొనేవాడు జీవుడు. కర్మాగారం వంటిది తల్లి గర్భం. అందులో టెక్నీషియన్లు వంటి వాళ్ళు మనస్సు, బుద్ధి ఇంద్రియశక్తులు, జీవశక్తులు. వీరందరినీ ఎరిగిఉన్న ప్రాచీన శాస్త్రం వీళ్ళకి దేవతలు అని పేరుపెట్టింది. అందులో తల్లిగర్భంలో జీవుణ్ణి ఆధారంచేసి పెంచే దేవతలు పితృదేవతలు అనబడే వర్గంలో ఒక అంతర్భాగం. వాళ్ళు చంద్రకిరణాలు, చంద్రకళలు ఆధారంగా చేసుకొని గర్భంలో పిండాన్ని నిర్మాణం చేస్తారు. కనుకనే చంద్రుడు భూమిచుట్టూ ఒకసారి తిరిగే కాలవ్యవధి (28 రోజులు) స్త్రీ ఋతుకాలానికి, కేలండరులాగ పనిచేస్తుంది జీవుడు దేహంవిడచినప్పటి నుండి తల్లిగర్భంలో పడే లోపున జరగవలసిన పరిశుద్ధి కొంతఉంటుంది. దేహాన్ని విడచినపుడు దహనంచేసే వరకు కొన్ని కర్మలు, అటుపైన ప్రేతత్వాన్ని

లేకుండా చేయడానికి పదిరోజులవరకూ కుమారుడు ఆచరించే కర్మలూ ఒక తరగతికి చెందినవి. అలాగే దేహం విడచిన సంవత్సరములో ప్రతి మాసంలో అదే తిథి నాడు ఆచరించే కర్మలు మాసికాలు. ఆటుపైన ప్రతి సంవత్సరమూ ఆ మాసంలో ఆ తిథినాడు ఆచరించే వేదోక్త కర్మను ఆబ్దికం లేక తద్దినం అంటారు. నాలికమీద మందు పడితే మోకాటిలోఉన్న నొప్పి ఎలాతగ్గుతుందో అలాగే ఒక బ్రతికి ఉన్న వాడు భోక్తగా పూజించి శ్రాద్ధకర్మ చేస్తే చనిపోయినవాడికి ఉన్న పూర్వకర్మ దోషాలు తొలగుతాయి. దానితో ఆదేహం వదలిన వారికి, సూక్ష్మశరీరంలోని దుష్కర్మ బంధాలు తొలగి, పవిత్రమైన శరీరంతో మరల జన్మ లభిస్తుంది. ఆ పరిశుద్ధికి సంబంధించినవే చనిపోగానే చేసే శ్రాద్ధ కర్మలు. ఆ జీవి మళ్ళీ తల్లిగర్భంలో ఉత్తమ జన్మ పొందటానికి చేసే శాస్త్రీయమైన కర్మకాండయే తద్దినం. పిండ పితృ యజ్ఞం, పుష్కర శ్రాద్ధం. కొన్నివేల సంవత్సరాలనుండి మహా పురుషులు పుష్కరశ్రాద్ధపేర పితృకర్మలు ఆచరించినట్లు పురాణాలలో వర్ణింప బడి ఉంది. మనం కూడా వారి మార్గాన్ని అనుసరించి వారిచ్చిన విజ్ఞానాన్ని వినియోగించుకోవడం మంచిది. ప్రాచీన, నవీన శాస్త్రాలలో దేనినీ కాదనడం శాస్త్రీయ దృక్పథం కాదు. పన్నెండు సంవత్సరాలకు ఒకమారు వచ్చే ఈ సదవకాశాన్ని అందరూ వినియోగించుకొని పితృకర్మలు ఆచరించి, తమ పెద్దలైన పితురులకు సుఖ శాంతులు కల్పించడం శ్రేయోదాయకం"

— స్వర్గీయ డాక్టరు ఎక్కిరాల కృష్ణమాచార్య వారి పితృకర్మలు— వైజ్ఞానిక సమన్వయం అనే వ్యాసంనుండి.

అందుచేత కృష్ణాపుష్కర సమయంలో మధ్య తరగతికి చెందిన మానవుడైనా సాధారణ విధానంగా అన్న శ్రాద్ధం చేయడం ఉత్తమం.

పక్షాంతరంలో ఆమ్రశ్రాద్ధాన్ని లేకపోతే హిరణ్యశ్రాద్ధాన్ని చేయాలి. ఆ విధంగా చేయడం వలన పితృదేవతల అనుగ్రహం లభిస్తుంది. వంశాభివృద్ధి కలుగుతుంది. కుటుంబం సుఖశాంతులతో వర్ధిల్లుతుంది. కృష్ణాపుష్కర శుభసమయంలో పుష్కరవిధులు నిర్వహించిన పిమ్మట ఇంద్రకీలాద్రిపై వెలసిన శ్రీ కనకదుర్గను సేవించాలి.

నేరను మంత్ర యంత్రములు, నేరను బీజము లంబ! ధ్యానమున్
"నేరను, ముద్ర లే నెఱుగ, నేరను నిన్ స్తుతియింప, పిల్వగా
నేరను నిన్ను, ఆర్తిమెయినే విలపించుట యే నెఱుంగ, నిన్
జేరినవారి క్లేశములు చేరవటం చొకటే యెఱుంగుదున్.

లేదు ననుబోలు పాపియు, లేదు నిన్ను
బోలు పాపఘ్నియును పెక్కులేల పలుకు ?
లంబ! నీ దివ్య చిత్తాన నవధరించి
యోగ్య మెది అది నీవ చేయుము భవానీ !

— శ్రీ శంకరాచార్యకృత దేవ్యపరాధక్షమాపణ స్తోత్రమ్‌నకు స్వర్గీయ శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు కావించిన అనువాదంనుండి

ఆవిధంగా విజయవాడ కనకదుర్గ భవానికి ఆత్మనివేదనం కావించుకొని ఆమె కృపకు పాత్రులమై సంపూర్ణ కృష్ణా పుష్కర యాత్రాఫలాన్ని పొందుదాము.

శ్రీకృష్ణమ్మ తల్లికి జే జే లు !
శ్రీ కనకదుర్గమ్మ తల్లికి పూలదోసిళ్ళు ! !

"శ్రీకంఠమూర్తి పుణ్య
శ్లోకు మహాభాగు నిఖిల లోకారాధ్యున్
నాకేశభోగి సత్యగు
ణాకరు నచలాత్మ మల్లికార్జునదేవున్"

— నన్నిచోడుడు కుమారసంభవము నుండి

"లోకములెల్ల నీతనువులోనివ! నీవట యింతకల్గుదో
నాకస పద్మసంభవ జనార్దనులాదిగ నెల్ల పెద్దలన్
నీకొలదింతయంత యననేరక మ్రొక్కెదొ డంగిరన్న ని
న్నే కరణిన్ నుతింతు పరమేశ్వర! శ్రీగిరి మల్లికార్జునా"!

— పండితారాధ్యుని మల్లికార్జునశతకం నుండి

"చిక్కుచు మోకాళ్ళ జేతులూదుచును
వంగుచు వ్రాలుచు తొంగుచు జనుచు
చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు
గమకని పాటలకట్టి పాడుదము"

— పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర నుండి

"కాశ్యాంతు మరణాన్ముక్తిః
స్మరణా దరుణా చలే
దర్శనాదేవ శ్రీశైలే
పునర్జన్మ న విద్యతే"

"శ్రీశైల శిఖరం దృష్ట్వా
పునర్జన్మ న విద్యతే"

శ్రీశైల మల్లికార్జునస్వామినిగూర్చిన ప్రశంసలు ఇవి. ఇవి శ్రీశైలక్షేత్ర వైభవాల సంకీర్తనలు శ్రీశైలపుణ్యక్షేత్రం కృష్ణానదీ తీరపు మణిదీపం. కృష్ణానదీ కీర్తికేతనం శ్రీశైల శిఖరం. కృష్ణానదీ దివ్య తరంగాల సమూహం పాతాళగంగా ప్రవాహం. కృష్ణా పుష్కర శుభసమయంలో శ్రీశైలేశుని పాదాల ప్రోల పాతాళగంగగా ప్రవహించే కృష్ణను సేవించడం, భ్రమరాంబికా మల్లికార్జునులను దర్శించి, పూజించడం పుణ్యప్రదం. ద్వాదశ జ్యోతిర్లింగాలలో శ్రీశైలమల్లికార్జునలింగం ద్వితీయస్థానం పొందింది. అష్టాదశ శక్తిపీఠాలలో భ్రమరాంబిక ప్రముఖస్థానం వహించింది "శ్రీశైలశిఖందృష్ట్వా పునర్జన్మ న విద్యతే" అనెడి ప్రసిద్ధి పొందింది. "నాశిరస్సు నిన్ను ధరించాలి. నాశరీరం వేయికన్నులై నిన్ను చూడాలి. వేయి జిహ్వలై నిన్ను కీర్తించాలి. వేయి చేతులై నిన్ను సేవించాలి" ఇలా పర్వతుడు కోరుకున్నాడు. శివుడు అనుగ్రహించాడు. అదే శ్రీపర్వతం, శ్రీశైలం. శ్రీశైలానికి నాలుగు ద్వారాలు ఉన్నాయి తూర్పుద్వారం త్రిపురాంతకం. పశ్చిమద్వారం అలంపురం. దక్షిణ ద్వారం సిద్ధవటం. ఉత్తరద్వారం ఉమామహేశ్వరం. చంద్రవతి అనే రాజకన్య సమర్పించిన మల్లెపూలమాలలు ధరించి చంద్రవతి కోరికను మన్నించడానికి తెల్లని మల్లెపూలు ధరించి మల్లికార్జునుడయ్యాడు. అర్జునుడు పూజించిన అడవిమల్లెపూలను గ్రహించి శ్రీశైలనాథుడు శ్రీ మల్లికార్జునుడయ్యాడు. అరుణుడనే రాక్షసుని భ్రమరరూపంలో సంహరించడంమూలంగా పార్వతి భ్రమరాంబ అయింది. శ్రీశైల, సేవించినవారిలో రెండవ హరిహరరాయలు, శ్రీకృష్ణదేవరాయలుం శివాజీ ముఖ్యమైనవారు. శ్రీశైలం ఓషధీనిలయం. ఆదిశంకరులు సేవించిన దివ్యక్షేత్రం శ్రీశైలక్షేత్రం.

మహాభారతం, బసవపురాణం, పండితారాధ్య చరిత్ర, 'రస రత్నాకరం', 'ప్రభులింగలీల', కాశీఖండం, స్కాందపురాణం శ్రీశైల ప్రశంస కావించాయి. 'తేవారమ్' అనే తమిళ గ్రంథంలో కూడా శ్రీశైల ప్రశంస ఉంది. కృష్ణాపుష్కర సమయంలో అఖిల భారత ఖ్యాతిపొందిన సుప్రసిద్ధ శైవక్షేత్రమైన శ్రీశైలక్షేత్రాన్ని దర్శించి భ్రమరాంబికా, మల్లికార్జునులను సేవించి, స్తుతించి, సంకీర్తన కావించాలి.

"అక్షయంబుగ కాశిలోపల అన్నపూర్ణ భవానివై
సాక్షి గణపతి కన్నతల్లివి సద్గుణావతి శాంభవీ
మోక్షమొసగెడు కనకదుర్గవు మూలకారణశక్తివీ
శిక్ష చేతువు క్రూరజనులను శ్రీగిరి భ్రమరాంబికా"

— భ్రమరాంబాష్టకంనుండి

కృష్ణానది శ్రీశైలం దాటి ప్రవహిస్తూ, వయ్యారాలు ప్రకటిస్తూ, వంపుతిరిగే ఒక అందమైన తావులోని ఒక శివుని కోవెల అమరేశ్వరాలయం. కృష్ణానదీ మాతా, అమరేశ్వరస్వామీ పరస్పరం పలకరించుకొనే స్థితిలో —నదీ, దేవాలయం నెలకొనిఉన్నాయి. దేవాలయం మెట్లు దిగుతే కృష్ణానది. మెట్లు ఎక్కితే అమరేశ్వర స్వామి. అమృత మథన, సంపాదనముల పిమ్మట దేవతలు విజేతలై రాక్షసులు పరాజితులయ్యారు. రాక్షసనేత తారకాసురుడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి బ్రహ్మ అనుగ్రహం పొందాడు. "తనను అజరునిగా, అమరునిగా, అజేయునిగా' చేయుమని బ్రహ్మను తారకుడు వరం అర్థించాడు. "అమరుడు కావటం సాధ్యంకాదు. ఒక బాలుని వల్లతప్ప మిగిలిన

వారివల్ల నీ అజేయత్వానికి భంగం కలుగదు" అంటూ బ్రహ్మ వరం అనుగ్రహించాడు. తారకాసురుడు త్రిపురాలను నిర్మించి, వానిలో విహరిస్తూ దేవతలను పీడించసాగినాడు. పరాజయం పరాభవం పొందిన దేవతలు ధరణికోటలో తలదాచుకొన్నారు. 10 వేల సంవత్సరాలు జరిగిన యుద్ధంలో తారకాసురుడు ఇంద్రుణ్ణి ఓడించాడు. శ్రీహరిని దేవతలు రక్షణకోసం ఆశ్రయించారు. శివభక్తుడైన తారకుణ్ణి జయించాలంటే శివానుగ్రహం పొందాలని దేవతలకు శ్రీమహావిష్ణువు హితవు చెప్పాడు. దేవతల విన్నపం మన్నించి తారక సంహారంకోసం దేవసేనానాయకత్వం కుమారస్వామి స్వీకరించడానికి యేర్పాటు చేసాడు. కుమారస్వామి తారకాసురునిపై విజృంభించాడు. శివుడు కుమారస్వామికి తారకుని మరణరహస్యం తెలిపాడు. తారకాసురుని కంఠసీమలో అలంకృతిమైన పంచబ్రహ్మ, పంచాక్షరీ, పంచతత్వ, పంచభూత మయమైన మహాశివ లింగాన్ని పంచఖండాలుగా ఖండించి అవి పడిన క్షేత్రాలలో ఆ లింగ శకలాలు ఎదగకుండా శివలింగ ప్రతిష్ఠలు కావించాలని — అప్పుడు తారకాసుర సంహారం సాధ్యమవుతుందని పరమశివుడు దయాంతరంగుడై కుమారస్వామికి తారకసంహార రహస్యం వివరించాడు. కుమారస్వామి నాయకత్వంలోని దేవసేనల, తారకాసురుని ఆధ్వర్యంలోని రాక్షస సైన్యాల మధ్య సంకుల సమరం సాగింది.

కుమారస్వామి తారకాసురుని కంఠసీమలోని పంచబ్రహ్మ పంచాక్షరీ పంచతత్వ పంచభూతమయ పరమేశ్వరలింగాన్ని పంచఖండాలుగా ఖండించాడు. ఆ పంచఖండాలు పంచారామాలుగా యేర్పడ్డాయి. అవే అమరారామం, సోమారామం, క్షీరారామం, దక్షారామం,

కుమారారామం అనే పంచసుప్రసిద్ధ శైవక్షేత్రాలుగా రూపొందాయి. పంచఖండాలలో ఒక ఖండం కృష్ణాతీరంలో ధరణాలకోటవద్ద పడింది. అది అమరేశ్వరునిచే ప్రతిష్ఠింపబడింది. అమరేశ్వరస్వామి వెలసిన అమరారామం అదే. గుణుపూడిలో చంద్రుని చేత ఒక లింగశకలము ప్రతిష్ఠింపబడింది. అదే సోమారామం. పాలకొల్లులో శ్రీరామునిచే ప్రతిష్ఠింపబడింది. ఆ శివుడు రామలింగేశ్వరుడు. అది క్షీరారామం. దక్షవాటికలో ఒక శకలం సూర్యుని చేత ప్రతిష్ఠింపబడింది. అతడు దక్షవాటి పురాధ్యక్షుడు భీమేశ్వరుడు. ఆ క్షేత్రం దక్షారామం. చాళుక్య భీమవరం (సామర్లకోట) లో ఇంకొక శకలం తారక సంహారకుడైన సాక్షాత్ కుమారస్వామి చేత ప్రతిష్ఠింపబడింది. స్వామి కుమార భీమేశ్వరస్వామి క్షేత్రం కుమారారామం. వీనిలో అమరావతి, దక్షారామం, సామర్లకోటలోని శివలింగాలు పీఠంనుండి 8 అడుగులు ఎత్తు కలిగి ఉన్నాయి. మిగతావి 2 అడుగులు ఎత్తున ఉన్నాయి. మనసు, తెరచి, కన్నులుమూసి, చేతులు జోడించి, ఆదిశంకరుణ్ణి, అమృతశంకరుణ్ణి, అమరశంకరుణ్ణి, అమరావతీశంకరుణ్ణి కృష్ణాపుష్కర వేళ సేవించుదాము.

కృష్ణా మండలంలో తప్పక దర్శించవలసిన చారిత్రక స్థలాలలో ఆనాటి బౌద్ధారామం అమరావతి ఒకటి. అమరావతి గుంటూరుకి సుమారు 35 కి. మీ. దూరంలో ఉంటుంది కర్నల్ మెకన్జీ అమరావతిని దర్శించిన నాటినుండి త్రవ్వకాలు జరుపబడ్డాయి. అమరావతికే 'ధరణికోట' 'ధాన్యకటకం' అనే పేర్లు ఉన్నాయి. అమరావతి అంటే ఇంద్రపట్టణమని అర్థం. పురాతన అవశేషాలు అశేషంగా ఉన్న ఈ ప్రాంతం పురాతత్త్వజ్ఞులను, చరిత్ర పరిశోధకులను, కళాకారు

లను విశేషంగా ఆకర్షిస్తున్నది. చైనా యాత్రికుడు హుయాన్ సాంగ్ అమరావతిని సందర్శించాడు. ఆంధ్రశాతవాహనుల ఆదిరాజ ధానీనగరం అమరావతి. ఒక అజ్ఞాతభారతీయ మహాశిల్పి మలచిన నిలువెత్తు అపూర్వమైన గౌతమబుద్ధుని విగ్రహం చూపరులను ఆనంద పరుస్తుంది. 56 కి. మీ. ప్రాంతంలో నిర్మితమైన మహాస్తూపం - తథాగతుని దివ్యపాదాలు అమరావతిని కళాభరితం కావించాయి. శిల్ప కళారమణీయం కావించాయి. అమరావతీ 'పురావస్తుప్రదర్శన శాల ప్రాచీన బౌద్ధ కళాసౌందర్య సంపద పరిరక్షణశాల. అలనాటిబౌద్ధ ఆరామం అమరావతిని సందర్శించడానికి నిత్యం యాత్రికులు వస్తూంటారు ఆంధ్రులు, వివిధరాష్ట్రాలకు చెందిన ఆంధ్రేతరులు, విదేశీ సందర్శకులు అమరావతిని చూడడానికి వస్తూంటారు.

ఆంధ్రాలోని అతిముఖ్యమైన బౌద్ధక్షేత్రం అమరావతి. ఈ స్తూపం అతిపెద్ద స్తూపం. క్రీ. పూ. 2వ శతాబ్దంలో ప్రారంభమై క్రీ.శ 150- 200 సం॥ములమధ్య ఇది నిర్మితమైంది. దీని శిఖరం 162', ఎత్తు 95' సాంచీస్థూపంఎత్తు 120, వెడల్పు 94' అమరావతి స్తూపం సాంచీ స్తూపం కంటె పెద్దది. అమరావతీస్తూపం ప్రదక్షిణ పథం వెడల్పు 15' కలిగిదానిచుట్టూగాడి 14' ఉంటుంది. దాని చుట్టూ ఉన్నగాడి మీద బుద్ధుని జీవితంలోని అతిప్రధానమైన ఘట్టాలు మనోహరంగా చిత్రింప బడ్డాయి. మధ్యమధ్య చెక్కబడి మనోహరంగా కనిపించే ముద్రలు భారత దేశంలోని మహత్తర కళారూపాలలో మహోన్నత శ్రేణికి చెం దినవిగా పరిగణింపబడుతున్నాయి. ఉత్తర భారత దేశానికి చెందిన సాంచీ, భారహూట్ స్తూపాల శిల్పసౌందర్యంతో తుల్యమైన శిల్పరమణీ యతను అమరావతి స్తూపం సంతరించుకొని ప్రకటించడం ఆంధ్రులకు

గర్వకారణం. మథురా, గాంధార శిల్పరీతులవలె అమరావతీ శిల్ప విధానం కూడా శిల్ప ప్రపంచంలో ప్రత్యేకతను సంపాదించుకొంది. సింహళ, ఆగ్నేయ ఆసియా దేశాలశిల్పకళను అమరావతీ శిల్పకళ ప్రభావితం చేసింది. అట్టి అమరావతిని కృష్ణాపుష్కర సమయంలో దర్శించడం శిల్పకళాభిమానుల ప్రథమ కర్తవ్యం.

కృష్ణా మండలంలో కృష్ణాతీరంలో ఉభయ సోమేశ్వరం, ఉభయ రామేశ్వరం, ఉభయ ముక్తేశ్వరం, ఉభయ నాగేశ్వరం, ఉభయనారాయణక్షేత్రాలను పావనంచేసి ఆ క్షేత్రాధిదేవతలను శ్రీరామచంద్రమూర్తి ప్రతిష్ఠించాడు. ఆ పవిత్ర క్షేత్రాలు శ్రీరామ పాదస్పర్శచే పునీతమైన దివ్యక్షేత్రాలు. ఆ దైవతామూర్తులు శ్రీరాముని అర్చనలు అందుకొన్న దివ్యమూర్తులు. పాపనాశనం - కోటిపల్లి ఉభయసోమేశ్వర క్షేత్రాలు. ఏలూరు, చిలుమూరులు ఉభయ రామేశ్వరక్షేత్రాలు. వేకనూరు, మూరకోటలు ఉభయముక్తేశ్వర క్షేత్రాలు. పెద్దకళ్ళేపల్లి పిట్టల లంకలలోనివి ఉభయనాగేశ్వర క్షేత్రాలు. అవనిగడ్డ, నల్లూరులు ఉభయనారాయణ క్షేత్రాలు. శ్రీరామానుగ్రహ ప్రాప్తికై శ్రీరాముని చేత ప్రతిష్ఠింపబడిన పైపది క్షేత్రాలను కృష్ణాపుష్కర సమయంలో సేవించడం శుభప్రదం. కాగా ఏలూరు, చిలుమూరులలోని ఉభయ రామేశ్వర క్షేత్రాలు ప్రత్యేకత సంతరించుకొన్న విశిష్ట క్షేత్రాలు.

శ్రీరాముడు రావణ సంహారానంతరం అయోధ్యకు మరలిపోతూ కొన్ని తావులలో శివలింగాలు ప్రతిష్ఠించాడు. కృష్ణాతీరంలోని చిలుమూరులో శివలింగ ప్రతిష్ఠా సంకల్పం చేసి మారుతిని కాశీ వెళ్ళి శివ

లింగం తీసుకొనిరమ్మన్నాడు. కాశీకి వెళ్ళిన ఆంజనేయుడు ప్రతిష్ఠాసమయానికి రాలేకపోయాడు. సీతసృష్టించిన లింగాన్ని ముహూర్త సమయానికి శ్రీరాముడు ప్రతిష్ఠ కావించాడు. అప్పుడు కాశీనుండి తెచ్చిన శివలింగంతో హనుమంతుడు చిలుమూరు చేరుకున్నాడు. పరిస్థితి అవగాహన చేసుకొని ఆగ్రహించాడు. ప్రతిష్ఠించిన లింగాన్ని తొలగించడానికి ప్రయత్నించాడు. శ్రీరాముడు హనుమను సముదాయించాడు. కాశీ ను డి తెచ్చిన శివలింగాన్ని కృష్ణానదిలోకి విసరివేయమని ఆదేశించాడు. అది ఐలూరులో పడింది. దాన్ని శ్రీరాముడు ప్రతిష్ఠించాడు. ఐలూరు, చిలుమూరు మధ్యప్రదేశం ఉభయ రామేశ్వర క్షేత్రంగా ఉదయిస్తుందని శ్రీరాముడు హనుమంతునకు అభయమిచ్చాడు. అదే ఉభయ శ్రీరామక్షేత్రం.

శివుడు కరికాల చోళునకు కలలో కనపడి ఐలూరు, చిలుమూరు శివలింగాలకు దేవాలయాలు నిర్మించమని ఆదేశించగా కరికాలుడు ఆ దేవాలయాలు కట్టించాడు. ఐలూరు దేవాలయం ఎన్నో ప్రత్యక్ష నిదర్శనాలకు నిలయంగా నిలచింది. గోవిందరాజులు అనే ప్రాంతపు రాజుకు సుమారు 300 సం॥ముల క్రితం నందీశ్వరుడు స్వప్నంలో సాక్షాత్కరించి తన విగ్రహం ఉన్న నెలవు తెలిపాడు. ఆ తావునుండి తరలించి దేవాలయంలో నిలుపుమన్నాడు. గోవిందరాజు నంది విగ్రహాన్ని బయటకు తీయించి ఆలయంలో ప్రతిష్ఠించాడు. సుమారు ఇరవై సంవత్సరాల క్రితం ఆ దేవాలయంలో ఒక సంఘటన జరిగింది. కార్తీక మాసంలో రాత్రి మూడు గంటలకు భక్తులు శివ ప్రదక్షిణాలు కావించడానికి వెళ్ళగా మూసిన శివాలయంలో మంత్రాలు వినిపించాయి. ఆలయ ద్వారాలు తెరవగానే మంత్రాలు వినిపించలేదు. నివేదన చేసిన కొబ్బరి

చెక్కులు కనిపించాయి. ఆ విధంగా దేవతల పూజలు అందుకొంది ఐలూరు శివాలయం. సర్వం శివసంకల్పమస్తు !

ఇక సేవించదగినది, సేవించవలసినది ఉభయ నాగేశ్వర క్షేత్రాలలోని పెద కళ్ళేపల్లిలోని స్వయంభూ దుర్గా నాగేశ్వరక్షేత్రం ఒకటి. ఇది కృష్ణాతీరంలో బందరుకు 18 మైళ్ళ దూరంలో ఉంది. కదళీపురం, రంభాపురం దీని నామాంతరాలు. కృతయుగ సమయంలో సవతుల కలహ కారణంగా కద్రువ కుమారులైన అష్టమహా నాగములు బ్రహ్మదేవుని ఆదేశం మేరకు శివార్చనకు ఉపక్రమించారు. కృష్ణానది తూర్పుగా ప్రవహిస్తూ ఉత్తరదిశకు మలుపు తిరిగే ప్రదేశంలోని ఏకాంతంగా, ప్రశాంతంగా ఉండే కదళీవనాన్ని వారు ఎంపిక చేసుకొన్నారు. ఒక శిలావేదిక నిర్మించారు. దానికి ఈశాన్యంగా గోముఖాకార సరోవరం ఏర్పాటు కావించారు. ఆ శిలావేదికపైన శివుణ్ణి ప్రతిష్ఠించి భక్తిశ్రద్ధలతో శివార్చన ప్రారంభించారు. ఆత్రేయాది మహాఋషులతో కశ్యపుడు వచ్చి వారికి శివపంచాక్షరీ మంత్రం అనుగ్రహించాడు. అష్టమహా నాగులు శివానుగ్రహపాత్రులై నాగగుండం రూపొందించారు. శివుడు అష్ట మహానాగులను అనుగ్రహించిన నాగేశ్వరుడై ఆవిర్భవించాడు. కదళీవనంలోని అష్ట మహానాగుల శివార్చనా కేంద్రం కదళీపురమైంది. అష్టమహానాగులకు శాపవిముక్తి కలిగించడానికి ఈశ్వరుడు నాగేశ్వరుడై ప్రత్యక్షమైన ప్రదేశందివ్యమైన స్వయంభూ నాగేశ్వర క్షేత్రమైంది. కాశీలోని మణి కర్ణికా తీర్థంవలె నాగేశ్వర క్షేత్రానికి కృష్ణానది ఉత్తరవాహినిగా ప్రవహిస్తోంది. అందుచేత ఇది 'దక్షిణకాశి' గా ప్రసిద్ధమైంది. ఉత్తర వాహినియైన కృష్ణానదీ స్నానం జన్మరాహిత్యం కలిగిస్తుందని పురాణాలు ప్రవచిస్తున్నాయి. కదళీపురంలో బలిచక్రవర్తి తపస్సు కావించి తపోసిద్ధుడయ్యాడుట. విశ్వామిత్రునిచేత ప్రతిష్ఠింపబడిన శ్రీ మదన

గోపాలస్వామి క్షేత్రపాలకుడు. అట్టి కదళీపురం భూగర్భంలో కలసింది. భక్తులకు కనుమరుగైంది.

చల్లపల్లి సంస్థానాధీశులు దైవభక్తులైన యార్లగడ్డ కోదండ రామన్న ప్రభువునకు క్రీ. శ. 1746 లో దుర్గా నాగేశ్వరస్వామి స్వప్నంలో గోచరించి నాగేశ్వరక్షేత్రపునరుద్ధరణకు ఆదేశించాడు. అంకి తీడు ప్రభువు నాగేశ్వరుని ఆదేశాన్ని శిరసావహించాడు. కదళీపుర క్షేత్ర సముద్ధరణ కావించినాడు. శైవాగమరీతిని ఆలయ, ప్రాకార గోపురాదులు నిర్మింపజేసాడు. నాగగుండాన్ని గోముఖాకారంగా పున రుద్ధరించాడు. యార్లగడ్డ ప్రభువు ఉత్సాహ, ప్రోత్సాహాలతో కదళీపుర దుర్గానాగేశ్వరక్షేత్రం అష్టమహానాగుల నాటి పూర్వ వైభవాన్ని సంతరించుకొంది. 600 ఎకరాల ఈనాము సంపాదించుకొంది. సుమారు 200 సం॥ల క్రితం శ్రీవిష్ణు తీర్థ యతీంద్రుల ప్రసన్నాంజనేయ ప్రతి ష్ఠతో పెదకళ్ళేపల్లి లోని శ్రీ నాగేశ్వరక్షేత్రం అత్యధికమైన ప్రశస్తిని సంతరించుకొంది. స్వామివారి శివరాత్రి మహోత్సవం వైభవంగా జరుగుతుంది.

జనమేజయుడు ప్రారంభించిన సర్పయాగానికి భయపడి ప్రాణ రక్షణకోసం కర్కోటకుడనే సర్పరాజు ప్రశాంతమైన కదళీపుర ప్రాం తంలో శివుణ్ణి ఆరాధించాడు. మృత్యుంజయుడు కర్కోటకనాగా కృతిలో ఆవిర్భవించి కర్కోటకుని మృత్యుభీతి తొలగించాడు. ప్రాణ రక్షణకావించాడు. ఆవిధంగా పెదకళ్ళేపల్లి స్వయంభూనాగేశ్వరక్షేత్రం వెలసినట్లు మరొక పౌరాణిక కథ ప్రచారం సంపాదించుకొంది. దుర్గా నాగేశ్వరస్వామి భక్తులరక్షణ పాలిట ఒకదుర్గం. దుర్గానాగేశ్వరస్వామి సన్నిధి భక్తులు పొందాలనుకొనే స్వర్గానికి ఒక సురక్షిత మార్గం!

"నాగేంద్రహారాయ త్రిలోచనాయ
భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ
తస్మై నకారాయ నమశ్శివాయ"
"శివ శివేతి శివేతి శివేతి వా
భవ భవేతి భవేతి భవేతి వా
హర హరేతి హరేతి హరేతి వా"
భజమన శ్శివ మేవ నిరన్తరమ్
"మహాదేవ మహాదేవ
దేవ దేవ జగత్పతే
భవా నేవ భవా నేవ
భవా నేవ గతిర్మమ"

# మంగళగిరి

" నమస్తే నారసింహాయ
నమస్తే మధువైరిణే
నమస్తే పద్మనేత్రాయ
నమస్తే దుఃఖహారిణే "

శ్రీశైలం, నాగార్జున కొండ, అమరావతి సరసను ప్రవహించిన కృష్ణానది, ఇటు తీరంలో నల్లగొండ జిల్లా దాటి కృష్ణాజిల్లాలోని జగ్గయ్యపేట ప్రాంతంలోనికి ప్రవేశిస్తోంది. కృష్ణాజిల్లాలో కృష్ణానదీ తీరాన గల ఆదిక్షేత్రం వేదాద్రి. యోగనరసింహస్వామి వెలసిన సుప్రసిద్ధ క్షేత్రం వేదాద్రి. ఋష్యశృంగ మహర్షి వేదాద్రి యోగ నరసింహస్వామిని ప్రతిష్ఠించాడని పురాణగాథలు తెలుపుతున్నాయి. వేదాద్రి యోగనరసింహ క్షేత్రం పంచనారసింహ క్షేత్రంగా భక్తులకు సుపరిచితమైంది. యోగానంద నరసింహస్వామి, లక్ష్మీనరసింహస్వామి, జ్వాలానరసింహస్వామి, జలనరసింహస్వామి, ఉగ్రనరసింహస్వామి అనే పంచ నరసింహమూర్తులున్న పంచనారసింహ క్షేత్రం వేదాద్రి. వేదగిరిపైన జ్వాలానరసింహస్వామి ఉన్నాడు. కృష్ణానదీ జలం మధ్యలో సాలగ్రామ శిలారూపంలో ఉన్న నరసింహస్వామి జల నర సింహస్వామి. ఉగ్ర నరసింహస్వామి వేదాద్రికి 2 మైళ్ళ దూరంలో ఉన్న గరుడాద్రిపై నెలకొని ఉన్నాడు. యోగనరసింహ, లక్ష్మీ నర సింహస్వాములు వేరువేరు మందిరాలలో దర్శనీయులు. వేదాద్రి యోగానంద నరసింహ క్షేత్రం భూతబాధితులకు, పిశాచ శాపగ్రస్తులకు స్వస్థత కలిగిస్తుంది. యోగానందలక్ష్మీ నరసింహస్వామివారి తిరుకళ్యా

త్సవాలు ప్రతియేటా వైశాఖశుద్ధ ఏకాదశి నుండి బహుళ విదియ వరకు సప్తాహ్నికంగా అంగ రంగ ప్రభలతో జరుగుతాయి. వేదాద్రికి 4 మైళ్ళ దూరంలో కృష్ణాతీరంలో కాకతీయ రాజులు స్థాపించిన ముక్త్యేశ్వరపురి క్షేత్రం కూడా చూడదగినదే!

''నమో నృసింహ నాథాయ
సర్వమంగళ మూర్తయే"

శ్రీ నరసింహ సాక్షాత్కారం ప్రహ్లాద భక్తితో కలుగుతుంది. నరుడు ప్రహ్లాదభక్తిని అలవరచుకోవాలనే దివ్యసందేశానికి సంకేతం నరసింహావతారం.

"జలే రక్షతు వారాహః
స్థలే రక్షతు వామనః
అటవ్యాం నారసింహశ్చ
సర్వతః పాతు కేశవః''

అరణ్యవాస కష్టాలు తొలగించుకోవడానికి, అభీష్టాలు సిద్ధింప జేసుకోవడానికి నరసింహస్వామిని పూజించాలి. అరణ్యవాస క్లేశహంత అభీష్ట ప్రదాత అయిన నరసింహ దేవతామూర్తి ఆరాధన చేసి ధర్మరాజు కురుక్షేత్ర యుద్ధవిజయం, రాజ్యలాభం పొందాడు. ధర్మరాజుకు సర్వమంగళములు అనుగ్రహించిన మంగళగిరి క్షేత్రమహిమ, మంగళ నరసింహుని చరిత్ర గ్రహించుదాము. విజయవాడ ఇంద్రకీలాద్రి, పైనుండి చూస్తే ఇవతలివైపున పవ్వళించిన ఏనుగు ఆకారంలో ఒక

కొండ కనిపిస్తుంది. అదే మంగళగిరి. ఇది విజయవాడకు సుమారు 8 మైళ్ళ దూరంలో ఉంటుంది. విజయవాడ నుండి దీనికి బస్సు, రైలు మార్గాలు ఉన్నాయి. ఇది కృష్ణానదికి సమీపంలోని గిరిక్షేత్రం. శ్రీహరిక్షేత్రం. నరకేసరిక్షేత్రం. అదే పానకాలరాయుని మంగళగిరి క్షేత్రం. ఇది కృత యుగంలో తోతాద్రి. త్రేతాయుగంలో స్తోత్రాద్రి ద్వాపరయుగంలో ముక్త్యద్రి. కలియుగంలో మంగళాద్రి. హస్తగిరి దీని నామాంతరం. దీని అనాది నామధేయం వైష్ణవాశ్రమం.

పార్వతికి శంకర భగవానుడు చెప్పిన 'భవానీ శంకర గీతా' రూపంలోని మంగళగిరిక్షేత్ర మాహాత్మ్యం బ్రహ్మవైవర్త పురాణంలో ఆవిష్కరింపబడింది. పారియాత్రి పర్వతం సప్తకుల పర్వతాలలో ఒకటి. పారియాత్రి భార్య సుశీల. సుశీలా పారియాత్రి దంపతుల సుపుత్రుడు హ్రాస్వశృంగి. అతడు శ్రీ హరిభక్తుడు. దివ్యతేజో విరాజితుడు. సత్వగుణ సంపన్నుడు. సుగుణభూషణుడు. ఆకృతిలో వికృతుడు. అదే అతని ఒక్క లోపం. తన వికృత ఆకారం తండ్రికి మనస్తాప కారణంగా ఉందని గ్రహించిన హ్రాస్వ శృంగి గృహం వదలిపెట్టి దేశసంచారం చేస్తూ కృష్ణానదికి దక్షిణంగా ఉన్న వైష్ణవ ఆశ్రమ ప్రవేశం కావించాడు. ఆశ్రమవాసం చేస్తున్నాడు శ్రీహరి ప్రీతికి మూడు సంవత్సరాలు తపస్సుచేసాడు. వైష్ణవదూతలు విష్ణుసాన్నిహిత్య భాగ్యం కలుగుతుందని అతణ్ణి దీవించారు.

సుశీల పుత్రవియోగదుఃఖం నివారించడానికి పారియాత్రి హ్రస్వశృంగిని అన్వేషించుకొంటూ వైష్ణవ ఆశ్రమ ప్రాంతానికి చేరుకొన్నాడు. హ్రాస్వ శృంగి తనఉనికిని తండ్రి గుర్తించకుండా గజరూపం ధరించాడు ఆశ్రమవాసులద్వారా హస్తి రూపంలోని హ్రాస్వశృంగిని గుర్తించి తల్లి బెంగ తీర్చడానికి రమ్మన్నాడు. "హరిసారం

తెలుసినవాడు సంసారం వలదు. తల్లిని ఓదార్చండి. నేను రాలేను" అని చెప్పి బ్రహ్మశృంగి తండ్రిని పంపించివేశాడు. విష్ణు భగవానుడు బ్రహ్మశృంగి భక్తికి మెచ్చి స్వయంవ్యక్త స్వరూపుడై ఆకాశ కొండ గుహలో ఆవిర్భవించి బ్రహ్మశృంగికి నిత్యపూజాభాగ్యం ప్రసాదించాడు

నముచి అనే రాక్షసుడు వైష్ణవాశ్రమంలో బ్రహ్మదేవుని సాక్షాత్కారం కోసం తీవ్రమైన తపస్సు కావించాడు. బ్రహ్మ ప్రత్యక్షమై నముచిని వరం కోరుకోమన్నాడు.

"ఆర్ద్రేణ శుష్కేన చ యక్షరక్షో విద్యాధరైః
పన్నగదేవసంఘైః నగైః ఖగైః వృశ్చిక
కీటదంశైః గజైర్వరాహై ర్మహిషైర్మృగేంద్రైః
దివ్యాస్త్రైరమరైర్నర్వానరై ర్వ్యాళ సంచయైః
మృతిర్మమాస్యాన్మహా సంఖ్యే వరందేహి ఏమూర్జజ"

హిరణ్యకశిపునివలె పొరపాటు పడకుండా అడగవలసినవి అన్నీ అడుగుతూ, తడి వస్తువుచేతగాని, పొడివస్తువుచేతగాని మరణం లేకుండా రాకుండా చేయమని నముచి బ్రహ్మను వరం కోరాడు. బ్రహ్మ అనుగ్రహించాడు. వరగర్వంతో నముచి సాధుబాధ కావించాడు. దేవతాపీడ సాగించాడు. దేవతలు నముచి బాధను శ్రీహరికి నివేదించారు. ""నముచికి ప్రాణభయముంది. మీకు భయంలేదు. నా అభయం ఉంది." అని శ్రీనివాసుడు దేవతల రాక్షసభయం నివారించాడు. ఇంద్రుడు రాక్షససంహారం ప్రారంభించాడు. విష్ణుమాయనుండి రాక్షస మాయతో బయటపడాలని, ప్రాణ రక్షణ ప్రయత్నంలో స్థూలశరీరం వదలి సూక్ష్మశరీరం ధరించి నముచి

పర్వతగుహాలోనికి ప్రవేశించాడు. ఇంద్రుడు సముద్రపు నురుగుతో చక్రాన్ని ముంచి సుదర్శనమంత్రంతో నముచిపై ప్రయోగించాడు. హిరణ్యశృంగికి పూజాభాగ్యం కలిగించిగుహలో స్వయం వ్యక్తంగా ఉన్న శ్రీహరి ఇంద్రుడు ప్రయోగించిన చక్రమధ్యభాగంలో (నాభిలో) నరసింహాకారంతో చేరి తన నిశ్వాసాగ్నితో నముచిని సంహరించాడు. రాక్షసుల రక్షణకు, దేవతల రక్షణకు శ్రీహరి ఆ విధంగా సుదర్శన నారసింహావతారం ధరించాడు. నముచిసంహార సమయంలో నముచిరక్తం కాలువగా ప్రవహించి సరస్సుగా యేర్పడింది. అదే "రక్తకుల్య." నముచిసంహార సమయంలోని స్వామి ఉగ్ర రూపం చూడడానికి దేవతలు భయపడ్డారు. బ్రహ్మరుద్రాదులు ప్రసన్నరూపం ధరింపమని ప్రార్థించారు. స్వామి ఆదేశింపగా దేవతలు తెచ్చిన అమృతంలో సగభాగం స్వీకరించి మిగిలిన సగభాగం వారికి ప్రసాదంగా అనుగ్రహించి సుప్రసన్న రూపంతో దర్శన మిచ్చాడు. ఆ ప్రసన్న రూపంతో అర్చావతార స్వరూపులై మంగళగిరిపై ఆవిర్భవించారు. అవతరించారు. కృతయుగంలో స్వామికి అమృతపానం త్రేతాయుగంలో గోఘృత పానం. ద్వాపర యుగంలో గోక్షీరపానం. కలియుగంలో పానకం ఆరగింపు. అందుకే మంగళగిరిస్వామి పానకాల స్వామి. అన్ని యుగాలలోను సగం తీసికొని సగం భక్తులకు ప్రసాదంగా మిగల్చడం స్వామి ప్రత్యేకత. మంగళగిరి పానకాలస్వామి సన్నిధానంలో ఎంత బెల్లం పానకం తయారు చేయబడినా ఒక్క చీమ గాని, ఈగగాని కనిపించదు.

శ్రీహరి సంకీర్తనాచార్యుడు నారదుడు వైష్ణవ ఆశ్రమంలో తపస్సు కావించాడు. నిత్యం నరసింహ సంకీర్తన సేవ కావించేవాడు.

క్షేత్ర సేవకు, దైవ దర్శనానికి ఒక భార్యాభర్తలు వచ్చారు. నారదుడు భర్తను సంసార విముఖునిగా, మోక్షాన్వేషిగా మార్చాడు. పుత్రప్రాప్తికి వచ్చిన భార్య ఆగ్రహంతో నారదుని పాల చెట్టుగా పుట్టనుని శపించింది. "నీకు సంతాన భాగ్యం కలుగుతుంది. నేను పాల చెట్టుగా స్వామి సన్నిధానంలో నిలిచే భాగ్యం కలిగించు" అని నారదుడు ఆమెను కోరాడు. ఆమె ఆమోదించింది. పాలచెట్టు ఫలాలు ఋతుస్నాతలైనవారు, వంధ్యలు తింటే బిడ్డల తల్లులు అవుతారు అని అంది. నారదుడు శాపసమయంలో కూడా నరసింహ సాన్నిహిత్యం కోరి సాధించాడు. చెట్టుగా, పుట్టగా, రాయిగా, రప్పగా, క్రిమిగా, కీటకంగా శ్రీహరి సన్నిధానం పొందడం ధన్యత అన్నాడు నమ్మాళ్వారు. నారదుడు పాలచెట్టుగా నరసింహ సన్నిధాన ధన్యత పొందాడు.

మంగళగిరి ఏనుగు ఆకారంగా ఉంటుంది. శ్రీవారి దేవాలయం ఏనుగు నోరువలె ఉంటుంది. స్వామివారి వదనం కొండలోనే మలచబడి ఉంటుంది. ఈ ఎగువ నరసింహుని కోవెలను ప్రతిరోజు ఉదయం తెరచి మధ్యాహ్నం 12 గంటలకు మూసి వేస్తారు. భక్తులకు స్వామి దర్శనం, సేవ ఆ సమయంలో లభిస్తుంది, మానవులకు పగకాలార్చన విధింపబడింది. రాత్రి దేవతల అర్చనకు ఉద్దేశింపబడింది. దిగువ నరసింహ దేవాలయం గోపురాలతో, శిల్పకళా వైభవాలతో అలరారుతో ఉంటూంది. దీనిలోని లక్ష్మీనరసింహస్వామి ప్రతిష్ఠ ధర్మరాజు కావించి ధన్యుడయ్యాడు. నృసింహప్రతిష్ఠ సంకల్పం కావించిన ధర్మరాజు భీముణ్ణి విగ్రహనిర్మాణానికి కావలసినగండశిల సేకరణకు నియమించాడు. భీముడు తెచ్చిన గండశిలను దేవశిల్పులచేత ఎడమ తొడపైన లక్ష్మీదేవి ఆసీనురాలైన భంగిమలో నరసింహస్వామి విగ్ర

హాన్ని రూపొందింపజేశాడు. పిమ్మట యథాశాస్త్రీయంగా ప్రతిష్ఠించాడు. నృసింహదేవుని అనుగ్రహ సిద్ధికై ఆరాధనా కార్యక్రమంలో నిమగ్నుడయ్యాడు. ఆ దేసమయంలో ద్వారకలో ప్రద్యుమ్నుడు తండ్రి శ్రీ కృష్ణుని తన జన్మతిథియైన ఫాల్గుణ శుద్ధ సప్తమి నుండి తొమ్మిది దినాలు నవరాత్ర దీక్షతో జన్మదినోత్సవాలు ప్రతి సంవత్సరం జరిగే యేర్పాటు చేయమని అర్థించాడు. కాబోయే రాజు ధర్మరాజుకు కృష్ణుడు ఈ కార్య భారం అప్పగించాడు. ప్రద్యుమ్నుని నవరాత్ర దీక్షా జన్మ దినోత్సవం మంగళగిరి లక్ష్మీనరసింహుని నవాహ్నిక దీక్షా బ్రహ్మోత్సవంగా నిర్వహింపబడే కట్టడి ధర్మరాజు కావించాడు. ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి నాడు స్వామివారి రథోత్సవం ! ప్రద్యుమ్నుని జన్మదినోత్సవ వేడుకలు మంగళగిరి తిరునాళ్ళు ! శ్రీ రామానుజాచార్యుల జన్మస్థానమైన శ్రీ పెరుంబుదూరులో రామానుజుని ప్రతి జన్మదినంనాడు మంగళగిరి నరసింహస్వామివారు గతంలో తమ దివ్య దర్శన భాగ్యం, సేవా భాగ్యం రామానుజునకు కలిగించిన దానికి గుర్తుగా నేటికీ "మంగళగిరి సేవ" జరుగుతోంది.

దిగువ లక్ష్మీనరసింహుని సన్నిధానంలో నిత్యం త్రికాల పూజలు జరుగుతాయి. అంగరంగ వైభవాలతో శ్రీ వారికి వివిధ ఉత్సవాలు నిర్వహింపబడతాయి. లక్ష్మీనరసింహుడు 'పసిడి పట్టము ధరించు శ్రీ ధరుడు' స్వామివారి వస్త్రాలు, వస్తువులు, వాహనాలు అన్నీ బంగారంవే ! లక్ష్మీ సమేతుడు కదా ! తంజావూరు మహారాజు సమర్పించిన స్వర్ణ కవచంగల దక్షిణావర్త శంఖం మంగళగిరి యాత్రికులను అలరించే ఒక ప్రత్యేక ఆకర్షణ. దిగువ నరసింహ సన్నిధానంలోని తూర్పు గాలి గోపురం మనోహరమైంది శిల్ప రమణీయత కలిగినది. సాధారణంగా గోపురం ఎత్తునుబట్టి గోపురం పునాది వెడల్పుగా ఉంటుంది.

ఇట్టి నిర్మాణ శైలిగల గోపురాలు ఎన్నో దక్షిణ భారతదేశంలో ఉన్నాయి. వీనికి విభిన్నమైన శైలిలో నిర్మితమైన గాలిగోపురం మంగళగిరి దేవాలయపు తూర్పుగోపురం. దీని ఎత్తు 150 అడుగులు. ఈ 150 అడుగులు ఎత్తుగల గోపురం క్రిందా పైనా బహుస్వల్ప తేడాతో స్తంభాకారంగా నిలబెట్టినట్లు కట్టబడింది. ఇట్టి గోపుర నిర్మాణ శైలి ప్రపంచంలో అరుదు. ఇటలీ దేశంలో 'పైసా' నగరంలోని 'లీనింగ్ టవర్సు' నిర్మాణశైలీ దీని నిర్మాణ శైలీ పోలి ఉన్నాయి. 999 గ్రామాలకు నాయకుడై అమరావతి పాలనా కేంద్రం కావించు కొన్న ఉత్తమ ప్రజాపాలకున్నగా వాసికెక్కిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుసింగారు 18వ శతాబ్దంలో మంగళగిరి లక్ష్మీనరసింహ స్వామివారి తూర్పు గోపురాన్ని కట్టించారు. మధుర మీనాక్షి గోపురానికి ఈ గోపురం ప్రతిరూపంగా ఉంటుంది. ఈ సమున్నత గోపురంలో సుదూర ప్రాంతాలకు చెందిన ప్రజలు వైకుంఠశిఖరాన్ని చూచుకొంటారు. ముక్కోటి ద్వారం అనే ఉత్తర ద్వారం శ్రీ మాడపాటి వెంకట్రావు గారు నిర్మించారు. ఈ ఉత్తరద్వారంపైన ఉత్తర గోపురం, దక్షిణ గోపురం శ్రీమాన్ నంద్యాల నరసింహాచార్యులవారు కట్టించారు. గోపురశోభలతో వాహన వైభవాలతో, ఉత్సవ కళలతో మంగళగిరి క్షేత్రం మంగళప్రదంగా ఉంటుంది.

బాలాంబ 18వ శతాబ్దానికి చెందిన మంగళగిరి లక్ష్మీనరసింహ స్వామివారి భక్తురాలు. కైవారపు సుబ్బన్నగారి భార్య. ప్రౌఢ వయస్సులోనే భర్తృ వియోగం సంభవించింది. మంగళగిరి నరసింహ దేవునికి తన జీవితం అంకితం చేసింది శ్రీమాన్ పురిపాళ్ళ నరసింహాచార్యుల వలన నృసింహ మంత్ర లాభం పొందింది. మంత్రసిద్ధి పొందింది. నృసింహ అనుగ్రహం, దర్శనం పొందింది. మంగళగిరి కొండను తన

తపో భూమిని చేసికొంది. ఒకనాడు రాత్రి కొండపై నిద్రింపగా హఠాత్తుగా క్రిందపడింది. తలపగిలి రక్తం కారింది. స్వామి తల నిమిరి స్వస్థత కలిగించి అదృశ్యమయ్యాడు. అన్నపానాలు, నిద్ర వదలి 3 సంవత్సరాలు కఠినమైన తపస్సు కావించింది. నాలుగేళ్ళ బాలునిగా నరసింహుడు కనపడి అన్నం పెట్టమన్నాడు, 'నేను నిరుపేదను నాకు లేని అన్నం నీకు ఎలా పెట్టగలుగుతాను' అన్నది బాలాంబ. "నీ హృదయం మంగళగిరి. దానిలో లక్ష్మీనరసింహుడు ఉన్నాడు నీవు ఈ బాలునకు బాలాంబవు. అన్నార్తులకు అంబవు అన్నపూర్ణగా అందరినీ పోషిస్తావు'' అని బాలుడు చెప్పి ఆమె రజోదోషం తొలగించి ఆమెకు తండ్రిగా, దేవునిగా అనుగ్రహించాడు. ఆమెకు దైవదర్శనం దేవాలయ సేవకులు నిరాకరించారు. కోనేరులోపడి ప్రాణత్యాగంచేయబోవగా స్వామి రక్షించాడు. అన్నదానంచేయమని మరల ఆదేశించాడు. ఊరి పెద్దలు ఆమెకు ముండనం చేయించడానికి మంగలిని నియోగించారు. మంగలి ఆమెలో సింహాన్నిచూచి పారిపోయాడు. తన శేషజీవితంలో అన్నదానం చేయడానికి, నరసింహదేవుని ఆదేశం శిరసా వహించడానికి నిశ్చయించుకొంది.

ఒకనాడు ఒకేరూపంలో ఐదుగురు వ్యక్తులు బాలాంబ గృహానికి భోజనానికి వచ్చారు. వారికి పిండివంటలతో భోజనం పెట్టింది. వారు భుజించి చేతులు కడుగుకోవడానికి దొడ్డిలోనికి వెళ్ళి మాయమై పోయారు. వారికై బాలాంబవెదకి వంటయింటిలోనికిరాగా వండిన వంటలు ఏమాత్రం తరగక ఉన్నాయట. ఒకనాడు భద్రాచలయాత్ర చేసిన వందలాది భక్తులు రాగా వారికి 6 శేర్ల బియ్యపు అన్నం బాలాంబ చేతిలో అక్షయమై అన్నదానం జరిగింది. ఆనాడు ఫాల్గుణశుద్ధ త్రయోదశి. నరసింహస్వామి కల్యాణ దినం. నాలుగు

వేలమంది బ్రాహ్మణులకు సంతర్పణ జరుగుతోంది. ఉండపోతగా వర్షం పడే వాతావరణం యేర్పడింది. బాలాంబ కర్పూర హారతి సమర్పించి నరసింహస్వామిని ప్రార్థించింది వర్షం బెడద తొలగింది. బాలాంబ చేసిన అన్నదానం సక్రమంగా సాగిపోయింది. బాలాంబ అన్నదాన మహిమ తో స్వగ్రామానికి చెందిన మహాదేవయ్య అనే బ్రాహ్మణ యువకుని ఉన్మాదాన్ని నివారించింది! ఆమె అందించే పటిక బెల్లపు ప్రసాదం జనులకు సుఖజీవితం ప్రసాదించేదట. బాలాంబగారి అన్నదాన మహిమ, బాలాంబగారిని అనుగ్రహించిన నరసింహదేవుని మహిమ మంగళగిరి క్షేత్రం నిలచినంత కాలం నిలుస్తాయి.

1810 సం॥ములో ప్రభు శ్రీ కృష్ణ చైతన్యస్వామి మంగళగిరి క్షేత్రం దర్శించి స్వామివారిని సేవించారు. చైతన్య మత స్థాపకులైన 'భక్తి సిద్ధాంత సరస్వతీ గోస్వామి' వారు 31-12-1930 తేదీన చైతన్యస్వామి మంగళగిరి క్షేత్రసందర్శనకు గుర్తుగా శ్రీ చైతన్య పాదుకలను ప్రతిష్ఠించారు. వల్లభ మత ప్రచారకులైన శ్రీ వల్లభాచార్యులవారు ఈ క్షేత్ర మండలి 'వటు తీర్థం' వద్ద తపస్సుచేసి లక్ష్మీ నరసింహుని అనుగ్రహ పాత్రులయ్యారు. ఈ క్షేత్రాన్ని, ఈ స్వామిని ఆది శంకరాచార్యులవారు, శ్రీ కృష్ణదేవరాయలవారు సేవించారట. హనుమంతుడు క్షేత్రపాలకుడు.

"లక్ష్మీ కళ్యాణ సరసి స్నానం చాద్రయవలోకనం
నృసింహ పానకం శేషం త్రయం కైవల్య దాయకం"

లక్ష్మీ కళ్యాణ సరస్సు మంగళగిరిలో ఉంది. క్షీరసాగర మథన సమయంలో ఆవిర్భవించిన లక్ష్మీని విష్ణుమూర్తికిచ్చి కళ్యాణం కావించారు. ఆ సమయంలో మంగళ స్నానానికి అన్ని నదులు, తీర్థాలు తీసికొని రాబడినవి. వానితో మంగళగిరిలో లక్ష్మీ కళ్యాణ సరస్సు

నిర్మింపబడింది. స్వామికి కళ్యాణ చక్ర స్నానం దీనిలోనే జరుగుతుంది. మంగళగిరి యాత్రికుడు లక్ష్మీకళ్యాణ సరస్సులో స్నానం చేయడం, మంగళగిరి ప్రదక్షిణం చేయడం, పానక శేషం స్వీకరించడం విధిగా ఆచరించాలి. ఆ నాడు ఈ క్రింది పద్యభావం మనస్సులో కదలి ఉల్లాసం కలిగిస్తుంది.

"ఉక్కు గంబంబు వెడలిన చక్కనయ్య
మున్ను ప్రహ్లాదు గాచిన వన్నెలాడు
నన్ను నేలిన శృంగార నాయకుండు
హృదయమున నిల్చు మంగళాద్రీశ్వరుండు"

జగన్నాథంలో భోజనం, సింహాచలంలో చందనం, మంగళగిరిలో పానం, తిరుపతిలో పరిపాలనం, శ్రీరంగంలో శయనం - ఇది లక్ష్మినారాయణుని, వైకుంఠనారాయణుని, శ్రీమన్నారాయణుని, నిత్యకృత్యం ! నిత్య దినచర్య. అట్టి లోక కళ్యాణమూర్తియైన శ్రీ విష్ణుమూర్తిని సేవించడమే మన దిన చర్య కావాలి. పానకాలస్వామివారి పానక శేషం ప్రసాదంగా భక్తులు పానం చేయడమే కాదు, మంగళగిరి పానకాల లక్ష్మినరసింహస్వామి దివ్యనామామృత పానంచేసి ధన్యులు కావాలి ! లక్ష్మీ నృసింహ కరావలంబం ఉన్నప్పుడే భక్తులకు అది సుసాధ్యం !

"శ్రీ మత్పయోనిధి నికేతన చక్రపాణే
భోగీంద్రభోగ మణిరాజిత దివ్యమూర్తే
యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్"

# శ్రీ కాకుళము

"శ్రీకాకుళము భక్తలోక చింతామణి
శ్రీకాకుళము సుకృతాకరము
శ్రీకాకుళము ధరాలోక వైకుంఠము
శ్రీకాకుళము మర్త్య సేవితంబు
శ్రీకాకుళము వేదసిద్ధాంత మహిమంబు
శ్రీకాకుళము హత వ్యాకులము
శ్రీకాకుళము మహాక్షేత్రవతంసంబు
శ్రీకాకుళము సర్వసిద్ధికరము

తెలియ శ్రీకాకుళంబు నీ దివ్యదేశ
మాంధ్రనాయక ! నీవె శ్రీహరివి నిజము
చిత్రచిత్ర ప్రభవ ! దాక్షిణ్యభావ !
హత విమతజీవ ! శ్రీ కాకుళాంధ్రదేవ ! "

—ఆంధ్రనాయక శతకం నుండి.

శ్రీకాకుళము ఆంధ్ర మహావిష్ణువు అవతరించిన దివ్య క్షేత్రం. ఆంధ్ర సామ్రాజ్యానికి ఇది రాజధానీ నగరం. ఆంధ్ర జాతికి గర్వకారణమైన 'విజయనగరం'. ఆంధ్ర దేవుడు ఆవిర్భవించిన ఆంధ్ర వైకుంఠపురం శ్రీకాకుళం. ఇది విజయవాడకు 68 కి మీ. దూరంలో ఉంది. కృష్ణాతీరంలోను, కృష్ణామండలంలోను చూడవలసిన పుణ్య క్షేత్రాలలో శ్రీకాకుళము ఒకటి. భక్తి, శక్తి, ఆసక్తి కలిగి చూస్తే ముక్తి విముక్తి ప్రసాదించే ఎన్నో అపూర్వమైన పుణ్య క్షేత్రాలు కృష్ణామండలంలో ఉన్నాయి. కృష్ణాతీరాన దివ్యమైన ప్రభావం కలిగిన, మోక్షదాయకమైన, ముక్తి ప్రదమైన మహాపవిత్ర క్షేత్రాలు ఎన్నో ఉన్నాయి.

కృష్ణానదీమాత పావన సీమలోని పరమ పావన క్షేత్రం శ్రీకాకుళం. విజయవాడ, పామర్రు, బందరు, చల్లపల్లి నుండి ఈ క్షేత్రానికి బస్సు సౌకర్యం ఉంది. తెనాలి నుండి కొల్లూరు మీదుగా గాజులలంక వరకు బస్సులో వెళ్ళి అక్కడ నుండి పడవలో కృష్ణను దాటితే ఆంధ్ర విష్ణువు దర్శనం లభిస్తుంది. బ్రహ్మాండ పురాణంలో, పద్మపురాణంలో, స్కాంద పురాణంలో సహ్యాద్రి ఖండంలో శ్రీకాకుళ క్షేత్ర ప్రశంస, శ్రీకాకుళ మహావిష్ణువు వర్ణన గోచరిస్తున్నాయి. శ్రీహరి ఆదేశానుసారం పదు నాలుగు భువనాలను సృష్టించిన బ్రహ్మదేవుడు మనఃశాంతికి, విశ్రాం తికి కృష్ణాతీరంలో తపస్సు ప్రారంభించాడు. ఇంద్రాది దేవతలు, భృగు అత్రి, వశిష్టాది మహర్షులు వచ్చి శిల్పశాస్త్రవిధేయంగా మహావిష్ణువు విగ్రహం స్థాపించి పూజలు ఆరంభించారు. వారూ తపస్సు చేసారు. బ్రహ్మ తపస్సునకు మెచ్చి విష్ణువు సాక్షాత్కరించాడు " నేను ఆంధ్రు లకు ఆదిదేవుడనై, అధినాయకుడనై, ఆంధ్ర భాగ్యదేవతనై, ఆంధ్ర మహావిష్ణువునై 'కాకుళము' క్షేత్రంలో కల్పాంతం వరకు ఉంటాను" అని శ్రీహరి బ్రహ్మకు వరం అనుగ్రహించాడు. శ్రీ మహావిష్ణువు ఆవిర్భవించిన తావులో ఆంధ్ర విష్ణువుని ఆత్రేయ మహర్షి ప్రతిష్ఠిం చాడు. శ్రీకాకుళ దేవుని స్వప్న సాక్షాత్కార ఆదేశం మేరకు చంద్ర వంశానికి చెందిన చిత్రరథుని కుమారుడైన శశిబిందు మహారాజు శ్రీకా కుళ క్షేత్రాన్ని దర్శించి, దేవుని పూజించి, అచ్చటి మహర్షులను సేవిం చాడు. వారి సూచన ప్రకారం ఆంధ్ర మహావిష్ణువునకు ప్రప్రథమంగా దివ్యమైన దేవాలయం, ప్రాకారం, మండపాలు కట్టించాడు. స్వామికి అనేక గ్రామాలు సమర్పించాడు.

శశిబిందు మహారాజు ముని మనుమడు సుమతి. సుమతి శ్రీకా కుళ ఆంధ్ర మహావిష్ణువునకు పరమ భక్తుడు. సుమతి తన ఇరువురు రాణులైన ప్రభావతి, పుణ్యవతులతో కలిసి శ్రీకాకుళం క్షేత్రాన్ని

స్వామిని సేవించడానికి తరలి వచ్చాడు. శ్రీవారికి బురద నీటితో అభిషేకం జరగడం చూచి మనోగతంగా ఆవేదన చెందాడు. స్వామి నిమనసా ధ్యానించాడు. స్వామి అనుగ్రహంకోసం ప్రార్థించాడు. స్వామి స్వచ్ఛమైన జలంతో అభిషేకం పొందాలని ఆకాంక్షించాడు. శ్రీవారు చక్రం పంపి చక్రతీర్థం సృష్టించారు. పరమ పవిత్రమైన చక్రతీర్థం లోని స్వచ్ఛ జలంతో నాటి నుండి స్వామికి అభిషేకం జరిగే యేర్పాటు జరిగింది. శ్రీకాకుళేశ్వరుని సేవించడానికై రాణులతో సుమతి మహారాజు శ్రీకాకుళక్షేత్రంలో మకాం చేశాడు. రాణులు పూల మాలలు తయారుచేసి స్వామివారి పవ్వళింపుసేవకు సమర్పించేవారు. అర్చకుడు దేవునికి సమర్పించడానికి బదులుగా వానిని తనప్రియురాలైన వెలయాలికి అలంకరించి మరునాడు ఉదయం వాన్ని రాజకుటుంబానికి దైవప్రసాదంగా ఇచ్చేవాడు. ఒక నాడు పూలదండలలో పొడవైన తలవెంట్రుకలు వచ్చాయి. రాజు పూజారిని నిలదీశాడు. స్వామివారికి కొప్పు ఉంది. ఆ శిరోజాలు ఆ కొప్పులోనివన్నాడు. రాజు, రాణులు, మంత్రి పరీక్షకు వచ్చారు. అర్చకుని గాఢమైన భక్తికి స్వామి కరుణతో కొప్పు ధరించాడు. దైవరక్షణతో రాజు శిక్ష పూజారికి నివారించాడు. మంత్రి స్వామి కొప్పులోని వెంట్రుకలు పరీక్షకు లాగగా రక్తంబొట్లు వచ్చాయి. ప్రభువు అపరాధం మన్నించి అనుగ్రహింపమని స్వామిని ప్రార్థించాడు. శ్రీవారు కొప్పును ఉపసంహరించుకొన్నారు. "వైఖానసోక్తికి వంచన రాకుండా, కాకుళంబున నెరుల్ కాంచినావు" అని కాసుల పురుషోత్తమ కవి వర్ణించాడు.

"కాకుళ నగరి వైఖానసోక్తి నిజంబు
దోప, శిరోజమున్ - జూపినావు"

— హంసలదీవి గోపాలశతకం.

" వైఖానస సోక్తికి - వంచన రాకుండా
నెపల్ జూపినమాట నిజమయునేని"

— శ్రీకాళ శ్రీహరి శతకము.

ఈ శతక పద్యపాదాలు శ్రీకాకుళస్వామి శిఖా సందర్శనగాథను, భక్తవాత్సల్య మహిమను ధృవపరుస్తున్నాయి.

సోమశర్మ కథ శ్రీకాకుళదేవుని దివ్య మహిమను చాటిస్తోంది. పూర్వం కళింగ దేశంలో యజ్ఞశర్మ అనే ఉత్తమ బ్రాహ్మణుడు ఉండేవాడు. సోమశర్మ అతని కుమారుడు. కులధర్మం వదలి పెట్టాడు. వివాహితుడై కూడా నీచస్త్రీ సాంగత్యం పొందేవాడు. మాంసం, మద్యం, మగువలను పొందడమే లక్ష్యం కావించుకొన్నాడు. వానికి కావలసిన ధన సంపాదన కోసం చోరవృత్తిని వృత్తి ధర్మంగా స్వీకరించాడు. ఒకనాడు శ్రీకాకుళయాత్ర చేసి స్వామిని సేవించి వస్తూన్న యాత్రికులను దోచుకోవడానికి పథకం సిద్ధంకావించాడు. ఆ భక్తులను కలసి తన ఆకలిబాధ తీర్చమని అడిగాడు. వారు శ్రీకాకళనాథుని తీర్థ ప్రసాదాలు సమర్పించారు. వానిని సేవించడంతో సోమశర్మకు జాగృతి కలిగింది. దైవస్మృతి కలిగింది. అతని ప్రవృత్తిలోను మార్పు వచ్చింది. పశ్చాత్తాపం కలిగింది. భక్తులకు సోమశర్మ నిజం చెప్పాడు. ఆ భక్తుల సూచనను ఆచరణలో పెట్టాడు. వెంటనే కృష్ణానదిలో స్నానం చేసాడు. శ్రీకాకుళ మహావిష్ణువు సన్నిధానంలో నిలచి ఆత్మ నివేదనం కావించుకొన్నాడు. శేషజీవితం శ్రీకాకుళనాథుని సేవకు అంకితం కావించుకొన్నాడు. "ఇతరుల వస్తువులు తస్కరించి పాపాలు సంపాదించాను. తస్కరుణ్ణి అయ్యాను. నా పాపాలు నాకు తెలియకుండా నీవు దొంగిలించి నన్ను రక్షింపుము. శ్రీపతీ ! ఈ చోరపతిని కాపాడుము." అంటూ సోమశర్మ శ్రీకాకుళపతికి శరణాగతి పొంది తరించాడు. పతితుని పావనుని చేసిన శ్రీకాకుళమహావిష్ణువు పుణ్య కథ ఇది

పూర్వం కార్తవీర్యుడు వివిధ రాజ్యాలు జయించి చక్రవర్తియై పాలిస్తూ, ఆంధ్రసామ్రాజ్యం పాలిస్తున్న సుదర్శన మహారాజును తనకు కప్పం చెల్లించడానికి అంగీకరించవలసిందని. లేనిపక్షంలో దండయాత్రను, ఎదుర్కొనడానికి సిద్ధపడవలసిందని వర్తమానం పంపాడు. "కప్పం చెల్లించి సామంతుడుకావడం గౌరవప్రదం కాదు. ఆంధ్రసామ్రాజ్యం రక్షిస్తూన్నవాడు శ్రీకాకుళదేవుడు. శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు ఆంధ్రుల నాయకుడు, ఆంధ్ర సామ్రాజ్య అధినాయకుడు మాత్రమే కాదు-అతడు చక్రవర్తులకు చక్రవర్తి. నేను ఆంధ్ర మహావిష్ణువు సామంతునిగా పాలిస్తున్నాను. ఇతర చక్రవర్తులకు సామంతుడను కాలేను. నీ దండయాత్ర శ్రీకాకుళ ఆంధ్రమహా విష్ణువు సందర్శన భాగ్య యాత్ర అవుతుంది" అని సుదర్శన మహారాజు కార్తవీర్య చక్రవర్తికి సమాధానం పంపించాడు. ఆగ్రహించిన కార్తవీర్యుడు సుదర్శనుని చెరసాలలో బంధించాడు. శ్రీకాకుళమహావిష్ణువు సుదర్శన మహారాజు సతీమణి ప్రార్థనను మన్నించి రాణిని కరుణించాడు. రాజును అనుగ్రహించాడు. చెరసాల ద్వారాలు తెరిపించాడు. సుదర్శన మహారాజుకు కారాగార విముక్తి కలిగించాడు. కార్తవీర్యుడు విషయం గ్రహించి స్వయంగా సుదర్శనుని కారాగారంలో నిర్బంధించాడు. సుదర్శనుడు కారాగార విముక్తుడు కావడం, కార్తవీర్యుడు బంధించడం పన్నెండు పర్యాయాలు పునరావృతమైంది. అప్పుడు కార్తవీర్యుడు సుదర్శనుని నుండి ఇది శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువు మహిమ అని గ్రహించి శ్రీకాకుళ యాత్ర కావించి స్వామిని దర్శించి, సేవించి ధన్యుడయ్యాడు. ఆంధ్ర మహావిష్ణువు సన్నిధానంలో సుదర్శనుని ఆంధ్ర సామ్రాజ్యానికి మహారాజుగా పునః ప్రతిష్ఠించాడు. తనను ఆంధ్ర మహావిష్ణువు పాదసేవకునిగా ప్రకటించుకొన్నాడు. ఇది ఆంధ్ర విష్ణువు భక్తవిజయగాథ! ఇది ఆంధ్ర విష్ణువు ఆంధ్ర సామ్రాజ్య రక్షణం కావించిన కథ!

కవితార్కిక చక్రవర్తి శ్రీ వేదాంత దేశికాచార్యుని పుత్రులైన వరదగురుదేవులు శ్రీకాకుళ క్షేత్రాన్ని దర్శించి, ఆంధ్ర విష్ణువును సేవించి 'భగవద్ధ్యాన ముక్తావళి' అనే స్తోత్రం స్వామిపై రచించి గానం చేసారు.

" మూర్ధ్న్యాఖ్యధార్యం శ్రుతిపరిషదాం ముక్తిభాజాంచ పుంసాం
దత్తామోదం నిఖిల జగతాం దర్శితం వేదవాద్యైః
పద్మలీలా కమలమపరం కాకుళేశస్యపాదం
ప్రత్యాసీదన్మధు కరతు మే ప్రత్యహం భావబంధః "

ఈ శ్లోకం శ్రీకాకుళనాథున్నిపై వరదగురుదేవులు గానం చేసిన 'భగవద్ధ్యాన ముక్తావళి' లోనిది.

'శ్రీకళాం కాకుళేశః' అంటూ శ్రీ కృష్ణదేవరాయుని ఆస్థాన పండితుడైన లొల్ల లక్ష్మీధరపండితులు ఆంధ్ర విష్ణువుని ప్రస్తుతించారు.

"నెమ్మి ప్రత్యక్ష పరమ పదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయుడైన
యాంధ్ర వల్లభహరి సేవ నలరుచుండు
పెక్కు భంగుల ముమ్మడి తిక్కవిభుడు"

ఈ విధంగా అనంతామాత్యుడు తన 'భోజరాజీయం' లో తన తండ్రి తిక్కన శ్రీకాకుళంలోని శ్రీహరిని సేవించిన విధానం గూర్చి వివరించాడు.

" వచ్చి సదాంధ్రనాయకుని వాసవమునైన శ్రీకాకుళంబునన్
మచ్చిక వైష్ణవోత్తముల మాన్పిత వైభవమొప్ప సన్నుతుల్
మెచ్చగ సేయ నాహరిని మేల్మి ప్రదక్షిణ పూర్వకంబుగా
హెచ్చిన భక్తి మ్రొక్కి మది కింపగు వేడ్కల నుండి వెండియున్"

— పరవస్తు విరచిత 'ఉత్తారక పంచకాభ్యుదయము' నుండి.

"నీవంధ్రావని నాయకుండ వని నిర్ణిద్రాను రాగాప్తినా
భావంబుం ధ కవిత్వరీతిని భవత్పాదార విందస్తుతి
ప్రావీణ్యంబున నుండె బాలకృత మాకస్ఫార శీతాంశుబిం
భావాప్త్యుకర ప్రసారగతిదోపన్ కాకుళ శ్రీహరి"

— శ్రీకాకుళ శ్రీహరి శతకం నుండి

"చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్యభావ!
హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ" — శ్రీకాసుల పురుషోత్తమకవి

ఇవి కవులు శ్రీకాకుళ ఆంధ్రవిష్ణువునకు సమర్పించిన కవితా నీరాజనాలు.

"మున్నేను కళింగదేశ విజిగీషా మనీషన్ దండెత్తిపోయి, విజయ వాటిం గొన్నివాసరంబులుండి, శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధు సూదను సేవింపంబోయి హరివాసరోపవాసంబచ్చటగానింప, నప్పుణ్య రాత్రి చతుర్థయామంబున, స్వప్నమందు నీలమేఘచ్ఛాయకలిగి, తామర రేకులం దిరస్కరించెడు కన్నులు కలిగి యురంబునం గౌస్తుభ మాణిక్యంబు కలిగి. తన పార్శ్వమందు నిలచి లక్ష్మీదేవి యొకచేత కమలంబును, రెండవనిత తన హస్తంబునుం గేలించియుండ, చిరునగవుతో ఆంధ్రవల్లభస్వామి కనపడి" "ఆంధ్రభాషలో ఒక కావ్యమును రచించి నామవేదముతో శ్రీవేంకటేశ్వరుని కీర్తింపబడే తనకే అంకిత మివ్వవలసినదని" శ్రీకృష్ణదేవరాయని శ్రీకాకుళ ఆంధ్రవిభుడు ఆదేశించాడు. రాయలవారు శ్రీకాకుళఆంధ్రవిష్ణువు దేవాలయంలోని మండపంలో 'ఆముక్తమాల్యద' రచనకు శ్రీకారం చుట్టారు. ఆముక్త మాల్యద రచన శ్రీకాకుళఆంధ్రవిష్ణువు వరప్రసాదం. శ్రీకృష్ణదేవ రాయల శ్రీకాకుళ క్షేత్రయాత్ర స్వీయకవితా దిగ్విజయయాత్రకు నాందీగీతంగా ఉపకరించింది.

ఆత్రేయ మహర్షి స్థాపించిన శ్రీకాకుళ నాథుని అగస్త్యుడు వచ్చి అర్చించినట్లు సహ్యాద్రి ఖండం తెలుపుతోంది. శ్రీ కాకుళ క్షేత్ర ప్రాంతంలో దేవ, బ్రహ్మ, రుద్రహ్రదాలు, విష్ణు, సూర్య, సోమ పాపవినాశన తీర్థాలు అగస్త్య మహర్షి చేత సేవింపబడినవట. క్రీ. శ. 6వ శతాబ్దంలో ఆంధ్ర రాజ్యం పాలించిన శశిబిందు శ్రీకాకుళ దేవాలయ నిర్మాత. తరువాత కృష్ణానదీవరదలకు దేవాలయం విగ్రహం కొట్టుకొని పోయినవట. పల్లవులు దేవాలయం పునరుద్ధరించారు. తరువాత చోళరాజు ఆనందపాలుడు దేవాలయ ప్రాకారాదులు నిర్మించి చిరయశస్సు పొందాడు. మరల కృష్ణావరద ప్రమాదానికిలోనై దేవాలయం విగ్రహం కొట్టుకొనిపోయాయి. అప్పుడు ఒరిస్సా రాజు అనంతపాలుని కుమారుడు అనంగపాలుని ప్రధాన మంత్రి కంచీనగరం పై దండయాత్రకు వెళ్ళి, పుణ్యక్షేత్రాలు దర్శించుకొంటూ శ్రీకాకుళం వచ్చాడు. స్వామివారి స్వప్నగత ఆదేశానుసారం శంకరపురంలోని వేమశర్మ పెరడులోని కాకరతీగ క్రింద త్రవ్వించి ఆంధ్రవిష్ణువు దివ్య విగ్రహలాభంపొంది పునః ప్రతిష్ఠ కావింపజేసాడు. ఇదిసుమారు 12వ శతాబ్దపు సంఘటనగా భావింపబడుతోంది. మరల కృష్ణావరదలకు నష్టపోయిన ఆలయం ఉత్తరంగా జరిపి కట్టించిన కీర్తి శ్రీకృష్ణదేవరాయలు పొందాడు. యార్లగడ్డ, కొండపల్లిసీమ, లంకపల్లి, కంబాలదొడ్డి, పెదగాడిపట్టు, కారుమంచి గ్రామాలు స్వామివారిసేవలకు దానం కావించాడు. దేవరకోట సంస్థానాధీశులు శ్రీరాజా యార్లగడ్డ కోదండరామన్న క్రీ. శ. 17146వ సంవత్సరంలో శ్రీ కాకుళేశ్వర స్వామి ఆలయాన్ని పునరుద్ధరించారు. వారి కాలంలో నిజామల్లి అనే నైజాం నవాబు సంస్థానంపై దాడికి బయలుదేరి విజయవాడలో బస చేసాడు. శ్రీ ముత్తేవి పెరుమాళ్ళయ్య శ్రీకాకుళ దేవాలయంలో ప్రతిష్ఠించిన హనుమంతుని-

" పడిగల దేవుడవనుచును
నుడిగారపు శతకమందు నుతి సేసెదనే
కడుపడి గుట్టవు దళముల
జెడదోలుము శత్రుహంత ! శ్రీ హనుమంతా "

అంటూ ప్రార్థించగానే నవాబు సైన్యంపైన బాంబుల వర్షం పడి నవాబు దండయాత్రకు కొరపడింది. శ్రీ కోదండరామన్న గారి మనుమడు శ్రీ రాజా అంకినీడు బహద్దరు క్రీ. శ. 1792 నుండి 1819 వరకు సంస్థానపాలన కావించారు వారి ఆస్థానకవి శ్రీ కాసుల పురుషోత్తమ కవి. ఇతడు బహుశతక కర్త. ఇతనికాలంలో ఆంధ్రవిష్ణువు నదీగర్భంలో మునిగి పోయినాడట. అప్పుడు పురుషోత్తమ కవి కృష్ణానదిలో శుచిగా స్నానం చేసి నిలచి ఆశువుగా చిత్రచిత్ర ప్రభావ దాక్షిణ్య భావ- హతవిమతజీవ శ్రీకాకుళాంధ్ర దేవ'' అనే మకుటంలో 103 సీసపద్యాలతో పద్యాలు పఠించగా - అప్పుడు స్వామి అతని భక్తికి సంతోషించి పద్యానికి ఒక అంగుళం చొప్పున పైకి లేచి యథాస్థానంలోనికి వచ్చినాడట.

శ్రీకృష్ణ కర్ణామృతము రచించిన లీలాశుకుడు, భక్తురాలు మహారాజనర్తకి చింతామణి శ్రీకాకుళానికి చెందినవారని స్థానికులు చెప్తారు. శ్రీకృష్ణలీలాతరంగిణి రచించిన శ్రీనారాయణ తీర్థులవారు '' శ్రీకాకుళనగరీ, శ్రీ భూమి సహితం" అంటూ శ్రీకాకుళక్షేత్రప్రశంస, ఆంధ్ర విష్ణువు వర్ణన కావించారు. ముద్దుపళని జన్మస్థానం శ్రీకాకుళం ముద్దుపళని మధురకవయిత్రి, సంగీత, సాహిత్య, భరత శాస్త్రాలలో అపారమైన పాండిత్యం గలిగిన విదూషీమణి. ఆంధ్రసంస్కృత భాషలలో ప్రవేశం, పాండిత్యంగల ప్రముఖ విద్వాంసురాలు ముద్దుపళని. ఆండాళ్ రచన ' తిరువాయి మొళి ' అనే ద్రవిడ ప్రబంధానికి తెనుగు

సేత అదించింది. 'రాధికా సాంత్వనం' అనే మధుర భక్తి ప్రబంధం ముద్దు పళని లేఖినినుండి వెలువడింది. ఆమె సంగీతం, కవిత్వం, భరత నాట్యం శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణువు సన్నిధానం లోనే ప్రదర్శన కావించేది. ఈ విధంగా ముద్దుపళని తన సంగీత, సాహిత్య, నృత్య కళలను శ్రీ కాకుళ ఆంధ్రవిష్ణువుకు అంకితం కావించింది. 1760 లో తంజావూరు ప్రతాపసింహమహారాజు శ్రీకాకుళ క్షేత్రం దర్శించిన సమయంలో ముద్దుపళని సంగీత, కవిత్వ, నృత్యాలు విని, ఆస్వా దించి, తిలకించి, పులకించి ఆమెను తంజావూరు సంస్థానానికి ఆస్థాన విద్వాంసురాలుగా తోడ్కొని పోయినాడు. సిద్ధేంద్రయోగి సృష్టించిన కూచిపూడి యక్షగానం, భామాకలాపం, ఆంధ్రనాట్యం ప్రథమ ప్రదర్శనలు శ్రీకాకుళక్షేత్రం ఆంధ్రవిష్ణువు సన్నిధానంలోనే ప్రకటింప బడ్డాయి. కూచిపూడికి, మొవ్వ ప్రాంతాలకు చెందిన సిద్ధేంద్రయోగి, క్షేత్రయ్యలు శ్రీకాకుళం పాదపీఠానికి చెంది ధన్యులయ్యారు.

ఆంధ్ర సంస్కృతి వికాసానికి ఆవిధంగా శ్రీకారం చుట్టిన ఆంధ్ర విష్ణువు మందిర శిఖరంపై శ్రీ చక్రం ఉంది. ఉత్తరంగా రాజ్యలక్ష్మి మందిరం ఉంది. చోళుల కాలనాటి శివాలయం ఉత్తరంగా వేరే ప్రాంగణంలో ఉంది. దానిలో వెలసిన స్వామి ఏకరాత్రి ప్రసన్న మల్లి కార్జునస్వామి. వారే క్షేత్రపాలకస్వామి. స్వామివారి దేవేరి బాలా త్రిపుర సుందరి. ఆంధ్ర మహావిష్ణువుకుఎన్నో మహోత్సవాలు జరుగు తాయి. వైశాఖ శుద్ధ దశమి నుండి బహుళ చవితి వరకు శ్రీవారికి బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. శ్రీకాకుళపు తిరునాళ్ళు 'క్రీడాభిరా మంలో' శ్రీనాథుని చేత వర్ణితమయ్యాయి.

శ్రీ మహావిష్ణువు శ్రీకాకుళేశ్వరుని నామధేయంతో శివుని ఆరాధించడం మూలంగానే దీనికి 'శ్రీకాకుళం' అనే పేరు వచ్చింది. శ్రీకాకుళ ఆంధ్ర విష్ణువును ప్రతి ఆంధ్రుడూ దర్శించి సేవించాలి !

# కొండపల్లి కోట

"కృష్ణవేణి నమస్తుభ్యం
సర్వపాప ప్రణాశిని
త్రిలోకే పావనజలే
రంగత్తుంగ తరంగిణి"

శ్రీ కృష్ణవేణీ నదీమాత సుందరవదనం మహాబలేశ్వరం, నరహరిపురం ఆమె హృదయసదనం. శ్రీశైలంనుండి శ్రీకాకుళం వరకు గల ప్రాంతం నాభిప్రదేశం. హంసలదీవి, పెదకళ్లేపల్లి ప్రాంతం పవిత్ర పాదద్వయం. ఆ విధంగా సాక్షాత్కరించి, విస్తరించి, ప్రవహించే కృష్ణవేణీనదికి రెండువైపులా అసంఖ్యాకములైన పుణ్యతీర్థాలు వెలిసాయి. మొత్తం 133 పుణ్యతీర్థాలను కలిగి, అనేక క్షేత్రాల సరసను నది ప్రవహిస్తోంది. ఆ 133 తీరాలలో ఈ దిగువ 60 తీర్థాలు పేర్కొనదగినవి.

ఆ 60 తీర్థముల పేర్లు ఇవి.

అనంత, అష్ట, అఘహారి, అమరజ, అమలక, ఆదిత్య, ఇంద్ర, కకుద్మని, కంక, కర్కోటక, కుబ్జేశ్వర, కులతారక, కౌసిక, క్రౌంచ, కూర్మ, చక్ర, జంబు, జాతిస్మర, పౌలస్త్య, ఫల్గుణ, పాతాళగంగ, బ్రహ్మ, భారత, భైరవ, త్రిశూల, నారాయణ, నిర్జర, మధు, మహాతీర్థ, మార్కండేయ, మునితీర్థ, ముక్తితీర్థ, మలాపహారిణి, మూర్తిదర్శన, దుర్గా, యజ్ఞవాట, ఋణాపహరణ, నృసింహ, లింగతటి, విష్ణురుద్ర, విశాల, విష్ణుచ్ఛాయ, వేద, వేణీసంగమ, విహంగమ, వాసుకి, వైరస, వ్యాఘ్ర, శంఖ, శతలింగ, శుక్ల, సప్తఋషి, సప్తకోటి, క్షార దర్పహార, స్కందపుర, సప్తసాగర, సప్తకులోద్ధార, సోమ, సూర్య తీర్థములు.

సహ్యా పర్వతంపైన బ్రహ్మగిరి వేదగిరుల మధ్యగల అమలక మహాతీర్థం. కృష్ణవేణీ నదుల సంగమంలోని సంగమ తీర్థం. సర్వ కార్యసిద్ధి ప్రధానమైనది. శుభప్రదమైనది దానికి సమీపంలో విష్ణురుద్ర, బ్రహ్మ తీర్థాలు ఉన్నాయి. ఈ త్రిమూర్తితీర్థాలకు కొంచెం దూరంలో కకుద్మిని తీర్థం ఉంది. తరువాత పేరొందదగిన తీర్థం విహంగ తీర్థం. ఇచ్చటనే గరుత్మంతుడు తపస్సుచేసి అమృతం సంపాదించాడు. తరువాత భైరవ తీర్థం. దీనిలోని కృష్ణానదీ జలం పచ్చగా ఉంటుంది. సర్పరాజైన వాసుకి శివుణ్ణి ఆరాధించిన స్థలంలో యేర్పడింది వాసుకి తీర్థం. పులస్త్యబ్రహ్మ పూజించిన శివలింగం సమీపంలోనిది పౌలస్త్య తీర్థం. మార్కండేయుడు శివునిగూర్చి తపస్సుచేసిన తావులోనిది మార్కండేయ తీర్థం. కృష్ణానది దక్షిణ తీరంలో ఉన్న 13 తీర్థాలలో మణిహారంలో మాణిక్యంవలె ప్రకాశించే తీర్థం సంగమ తీర్థం. బ్రహ్మ పాపాలను నిర్మూలించడానికి సృష్టించిన 'మలాపహారిణీ' అనేనది కృష్ణలో సంగమించే చోట వెలసింది. సంగమ తీర్థం. పరశురాముడు 21 సార్లు క్షత్రియసంహారంగావించిన పాపాన్ని సంగమతీర్థం సేవించడంద్వారా తొలగించుకొన్నాడు. ఈ తీర్థానికి పశ్చిమభాగంలో గోపాదతీర్థం ఉంది గోపాదేశ్వరుణ్ణి కామధేనువు పూజించడంవలనదానికి గోపాద తీర్థం అనే పేరువచ్చింది. ఈ తీర్థాన్ని మూడురోజులు సేవించి గోపాదేశ్వరుణ్ణి పూజించినవారికి గోహత్యాపాపం నివారింపబడుతుంది.

గరుత్మంతుని బారినుండి రక్షణ పొందడానికై అనంతుడు గోపాద తీర్థ సమీపంలోని కృష్ణానదీమధ్యలో హరిహరులనుద్దేశించి తపస్సు కావించాడు. వారిని సాక్షాత్కరింప చేసికొన్నాడు. అనంతుని తపోభూమిలో వెలసినది అనంతతీర్థం దీన్ని సేవిస్తే అనంతకోటి పుణ్యాలు లభిస్తాయి. కైలాసనివాసం కలుగుతుంది. నైధవృడనే మహర్షి సూర్యభగవానుని గూర్చి తపస్సు కావించి సుప్రసన్నుణ్ణి కావించు

కొన్నాడు. అచ్చట వెలసిన తీర్థమే సూర్య తీర్థం దానిలో స్నానం చేసి సూర్యునకు అర్ఘ్య ప్రదానం చేస్తే సప్తజన్మల పాపాలు హరిస్తాయి. దాని తరువాత ప్రాముఖ్యం కలిగినవి సప్తకోటి తీర్థం, చక్రతీర్థ, శంఖ తీర్థం, మొదలైనవి. తరువాత శుక్ల, ఐరావత, కుబేర, దరిద్ర విమోచన లింగ, ఇంద్ర, రామేశ్వర, మయూర తీర్థాలు గణనీయమైన తీర్థాలు. విశ్వామిత్రుని తపస్సునకు సంతసించి కృష్ణవేణి విష్ణుభగవానుని చిహ్నలుగల సుందర దేవతా స్వరూపంలో ప్రత్యక్షమై అనుగ్రహించింది. అందుచేతనే అచ్చటగల విశ్వామిత్ర తీర్థం విశ్వ విఖ్యాతమైనది. శ్రీ మహావిష్ణువుచేత సంహరింపబడిన లవణాసురుడు కృష్ణానదీ జల స్పర్శ వలన విముక్తుడైన చోట వెలసిన తీర్థం 'లవణ తీర్థం'. అది ముక్తి తీర్థం. ఈ తీర్థాలు గాక శ్రీశైలంలోని పాతాళగంగ, ముక్తిక్షేత్ర, దుర్గా తీర్థాలు కూడా సేవింపదగినవే ! సాలగ్రామ నారసింహ తీర్థం (వేదాద్రి) సుదర్శన నారసింహ తీర్థం (మంగళగిరి), అమరేశ్వర తీర్థం (అమరావతి) ఆదిగా గల తీర్థాలు సేవింపవలసినవి. కృష్ణాపుష్కర సమయంలో కృష్ణా తీరంలో వెలసిన పై పవిత్ర తీర్థాలను సేవించడం ముక్తిదాయకం.

ఇటువంటి మహాపుణ్య తీర్థాల దివ్య చరిత్రతో వర్ధిల్లిన కృష్ణానది ప్రవహించే కృష్ణా జిల్లా చరిత్ర కూడా ప్రసిద్ధమైనదే ! సీతారాములు లక్ష్మణ సహితులై వనవాస సమయంలో కృష్ణాజిల్లాలోని మెరక ప్రాంతాలలో పర్యటించారు. ఆ విధంగా కృష్ణా మండలానికి శ్రీరామ పాదస్పర్శ లభించింది. ఆ విధంగా రామాయణ కాలంలో విజయవాడ ప్రాంతం గుర్తింపుపొందింది. మహాభారత కాలంలో అర్జునుడు విజయవాడ ఇంద్రకీల శైలంపై వైరి సంహారం కోసం తపస్సు కావించి, శివుని మెప్పించి పాశుపతాస్త్రం సంపాదించాడు. ఇది విజయవాడ ఇతిహాస కాలపు చరిత్ర. క్రీస్తుపూర్వం కృష్ణా జిల్లా చెంచు, కోయ, యానాదుల ఆధీనంలో ఉండేది. తరువాత ద్రవిడులు నివసించారు. క్రీ. శ.

2వ శతాబ్దంలో ఆంధ్ర శాతవాహనుల పాలనలో ఈ ప్రాంతం ఉండేది. వారు బౌద్ధమతాన్ని ఆదరించి బౌద్ధ విహారాలు, స్తూపాలు, చైత్యాలు నిర్మించారు. క్రీ. శ. 4-7 శతాబ్దాల మధ్య పల్లవులు, శాలంకాయనులు విష్ణుకుండినులు పాలించారు. విష్ణుకుండినుల రాజధానీ నగరం విజయవాడ. క్రీ. శ. 7-11వ శతాబ్దుల మధ్య తూర్పు చాళుక్యులు పాలించారు. వెలనాటి చోళులు, కాకతీయులూ కూడా పాలించారు. క్రీ. శ. 1328-1424 సం॥ముల మధ్య కొండవీటి రెడ్డిరాజుల పాలనా వైభవం పొందింది. ఒరిస్సాకు చెందిన గజపతుల ఆధీనంలోని కృష్ణా ప్రాంతానికి శ్రీకృష్ణదేవరాయలు విముక్తి కలిగించాడు. తరువాత ఖిల్జీ సుల్తానుల నైజాముల పాలనలో ఉంది. క్రీ. శ. 1611 నుండి ఆంగ్ల, డచ్చి, ఫ్రెంచి

వారి వ్యాపారం జరిగింది. ఈ జిల్లా 1765 లో ఆంగ్లేయుల వశమైనది. మచిలీపట్నం రేవు ప్రాముఖ్యత సంతరించుకొంది. ఇట్టి చారిత్రక ప్రాముఖ్యం పొందిన కృష్ణా మండలంలో నిదర్శనీయ స్థలాలలో కొండపల్లి ముఖ్యమైనది.

కొండపల్లి విజయవాడకు 16 కి. మీ. దూరంలో ఉంది. ఇది చారిత్రక ప్రశస్తి గల పట్టణం. దీనిని చేర్చి 100 చదరపు మైళ్ళ విస్తీర్ణం లో పర్వతాలు, అడవులు వ్యాపించి ఉన్నాయి. సుమారు 2 మైళ్ళు ఎత్తుగల పర్వతాలు ఇవి. క్రీ. శ. 1362 - 1377 మధ్య పాలించిన అనవేమారెడ్డి అనేరెడ్డిరాజు 12 మైళ్ళ విస్తీర్ణంలో కొండపైన కోటకట్టించాడు. శత్రువుల ప్రవేశానికి దుర్లభమైన రీతిలో ఇది నిర్మితమైంది. కొండపల్లి కోట పహారాకు సముద్రమట్టానికి 2000 అడుగుల ఎత్తున ఉన్న ఒంటిమిట్ట నుండి యేర్పాట్లు కావింపబడ్డాయి. ఒంటిమిట్టకు కోటకు మధ్య అసంఖ్యాకమైన రహస్యమార్గాలు నెలకొల్ప బడినందువల్లనూ ఒంటిమెట్ట ప్రధాన దుర్గ రక్షణ స్థావరంగా స్థిరపడింది. కొండపైన సుందరమయిన ఉద్యానవనాలు, విశాలమయిన సరసులున్న

నిర్మింపబడ్డాయి. వానిలో రాజదంపతులు వనవిహారం, నౌకావిహార కావించేవారట. క్రీ. శ. 1481లో ఒరిస్సారాజులనుండి ఈకోటను బహమనీ సుల్తానులు స్వాధీనంకావించుకొన్నారు.

మరల అది ఒరిస్సారాజుల వశంకాగా శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1515 లో జయించాడు. క్రీ శ. 1534 - 1543 సం॥ల మధ్య కులీకుకుతీబ్‌షా పాలనలో కోట ఉన్నది. ఇతడు కోటకు పెద్ద ఎత్తున మరమత్తులు చేసి పూర్వపు ఔన్నత్యం కల్పించాడు. 1579లో సుల్తాన్ దీనిని జయించి ముసప్తాఖాన్‌ను రాజప్రతినిధిగా నియమించాడు. అందు చేత దీనికి ముస్తాఫానగర్ అనే పేరు వచ్చింది. ఇతడు ఒక దర్గా, మసీదు నిర్మించాడు. 1696—1749 మధ్య పాలించిన అబ్దుల్లాఅసన్ మేలురకపు కలపతో కొండమీద 'బాలసాహిస్పా' అనే సుందరమయిన భవనం నిర్మింపజేసాడు. నేడు ఆపాడుపడిన భవనం, కోట చూపబడవలసినవి. నైజాం నుండి 1766 లో ఈ కోటను జనరల్ కైలాడ్ స్వాధీనంకావించుకొన్నాడు. 1859 వరకు అక్కడ ఒక చిన్న బ్రిటీషు పటాలం ఉండేది. నేటికీ కొండపల్లి కోట దర్శించే యాత్రికుల్ని - వారి హృదయాలను ఆకర్షిస్తూనే ఉంది. కొండమీద పెరిగే చెట్లనుండి మెత్తనిరకం చెక్కతో కొండపల్లిలో స్థిరపడినరాజస్థాన్‌కు చెందిన హస్తకళకు పేరు పొందిన కుటుంబాలవారు అందమయిన బొమ్మలు తయారుచేస్తారు. అవేకొండపల్లి బొమ్మలు. జీవం, చైతన్యంగల కళాఖండాలు. కొండపల్లి బొమ్మలు. కృష్ణాపుష్కర సమయంలో తప్పక చూడవలసిన దర్శనీయసలాలో కొండపల్లికోట ఒకటి. పిల్లలకు కొనవలసిన ఆటవస్తువులలో ముఖ్యమయినవి కొండపల్లి బొమ్మలు. గొల్లపూడి, నున్న, పటమట, ఉండవల్లి విజయవాడకు చెందిన ప్రధానమయిన ప్రదేశాలు. చోళరాజులు, రెడ్డిరాజులు విజయవాడ ప్రాంతాన్ని పాలించిన కాలలో ప్రభువులకు ప్రధాన అధికారులకు, ధనవంతులకు గొల్లపూడినుండి. పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మొదలైన పదార్థాలు సరఫరా చేయ

బడేవి. గొల్లపూడి ఆనాడు పరిశ్రమ కేంద్రంగా ప్రాముఖ్యత సంతరించుకొంది. నూనె వ్యాపారానికి ముఖ్య కేంద్రమున్న, ఇంద్రకీల పర్వతానికిచెందిన ఒకభాగంపడిన ప్రదేశమే పటమట. దానిని పశ్చిమ ఇంద్రకీలాద్రి అంటారు. కృష్ణానది ఇంద్రకీలపర్వతాన్ని బద్దలు చేసి కొంత వైశాల్యం చాలక ప్రవహించుకొని వచ్చినదానికి పటమట అని పేరు. ఈ దృశ్యం తరువాత చూడవలసినవి ఉండవల్లి గుహలు వీనిలోని అనంతపద్మనాభస్వామివారి దేవాలయం దర్శనీయమైంది. దీనిలో పూజాదికాలు ఉండవు. పురావస్తుశాఖ పర్యవేక్షణలోని ఈ గుహలలో ఆంజనేయాది దేవతా విగ్రహాలు ఉన్నాయి.

విజయవాడలో కొత్తగుళ్ళుగా పేర్కొనబడే శ్రీ కోదండ రామాలయం, శ్రీ నగరేశ్వర ఆలయం చూడదగినవి. విజయవాడకు చెందిన ఈదిగువ దేవాలయాలుకూడా దర్శనీయాలు.

| | |
|---|---|
| కొత్తపేట | శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం |
| | శ్రీ పంచముఖ ఆంజనేయ ఆలయం |
| పేరరాజు చెరువుపేటకొండ | శ్రీ ఆంజనేయస్వామి ఆలయం |
| మాచవరం | శ్రీ ఆంజనేయస్వామి ఆలయం |
| గాంధీనగరం | శ్రీ సత్యనారాయణస్వామి ఆలయం |
| గన్నవరంపేట | |
| బావాజీపేట | |
| హనుమాన్ పేట | రామాలయాలు, శివాలయాలు |
| దుర్గాపురం | |
| సత్యనారాయణపురం | |

కృష్ణాపుష్కర సమయంలో ముఖ్యంగా చూడవలసింది శ్రీ శివ రామకృష్ణ క్షేత్రం నవవిధభక్తిపద్ధతిలో శ్రవణభక్తికి రూపకల్పన చేసే

ఉద్దేశంతో విజయవాడలో ది. 17-2-1951 తేదీన స్వర్గీయ పండిత కాశీ కృష్ణమాచార్యులవారి అధ్యక్షతను సంఘం యేర్పడింది. ఈ సంఘం 1951 లో రిజిష్టరు చేయబడింది. శ్రీ శివరామకృష్ణ క్షేత్ర నిర్మాణానికి స్థలం 1,84,000రూ - తో కొనబడింది 1973 సం॥లో శ్రీ శృంగేరి పీఠాధిపతులచేత ఈ దేవాలయ సముదాయానికి ప్రతిష్ఠా కార్యక్రమం నిర్వహింపబడింది. 1976 లో దీని రజతోత్సవం వైభవంగా జరిగింది. ఈ క్షేత్రంలో నవగ్రహమందిరం, శివాలయం, రామాలయం, ఆంజనేయుని కోవెల, శారదాదేవి మందిరం, శ్రీ రామలేఖన మందిరం, శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయం నిర్మింపబడ్డాయి. కళ్యాణమండపం, ప్రవచన సదనం ఉన్నాయి. కొన్ని వందల రామకోట్ల రామ నామాలు ఈ క్షేత్రంలో ఉన్నాయి. ఈ దేవాలయ సముదాయంలోని అన్ని దేవాలయాలలో నిత్య, వార, పక్ష, మాస, సంవత్సరోత్సవాలు మహావైభవంగా జరుగుతాయి. రాష్ట్రంలో సువిశాల ప్రాంగణంలో ఇంత పెద్ద దేవాలయ సముదాయం గల క్షేత్రం విజయవాడ నగరంలోని శ్రీ శివరామకృష్ణ క్షేత్రం మాత్రమే! నిత్య భగవన్నామ సంకీర్తనద్వారా భక్తి ప్రచారానికి శ్రీ శివరామకృష్ణ క్షేత్రం కృషిచేస్తోంది. ముక్తిని సాధించే శక్తి, భక్తి అనే దివ్యనాదం, నినాదం శ్రీ శివరామకృష్ణ క్షేత్రం ప్రతిభక్తుని హృదయంలోనూధ్వనింప జేస్తోంది. ప్రతిధ్వనింప జేస్తోంది.

# ముద్దుగోపాలా!

"శరణం శరణం మునీంద్ర సన్నుత శరణం కమలనాయక
శరణ మచ్యుత పురనివాస స్వామివరదరాజ ప్రభో"
-శివనారాయణ తీర్థులు

"భామనే సత్యాభామనే
భామరో శృంగార జగదభిరామనే ముఖవిజిత హేమా
ధామనే ద్వారకాపురాధ్యురామనే వయ్యారి సత్యా -
—సిద్ధేంద్రయోగి.

శివనారాయణ తీర్థుల నివాస స్థానం కూచిపూడి. సిద్ధేంద్ర యోగి జన్మస్థానం కూచిపూడి. క్షేత్రయ్య నృత్య సంగీతాలు అభ్య సించిన స్థానం కూచిపూడి. అది 17వ శతాబ్దం. అబ్దుల్లాకుతుబ్షా గోలుకొండ నవాబు - సహృదయుడు. నృత్యసంగీతాది లలిత కళా ప్రియుడు. పోషకుడు. భరతనాట్యానికి కేంద్రమైన కూచిపూడి ఆతని పాలన ప్రాంతంలోనిదే. కూచిపూడిని నాట్యకళా నిలయంగారూ పొందిం చిన సిద్ధేంద్రయోగి విన్నపాన్ని మన్నించి గోలుకొండ నవాబు ఆ గ్రామాన్ని కూచిపూడి భాగవతులకు అగ్రహారంగా బహూకరించాడు. ఇది విజయవాడకు 32 మైళ్ళ దూరంలో బందరు రోడ్డు ప్రక్కన ఉంది. మచిలీపట్టణానికి 10 మైళ్ళ దూరంలో ఉంది. కూచిపూడి అగ్రహారం కృష్ణానదికి 8 మైళ్ళ దూరంలో ఉంది.

శివనారాయణతీర్థులు క్రీ. శ. 1580 - 1680 సం॥ముల మధ్యవాడు. ఇతడు భక్తి, సాంఖ్య సిద్ధాంత గ్రంథాలు, తర్కశాస్త్ర గ్రంథాలు రచించాడు. అవి 11 గ్రంథాలు. అవి సంస్కృతంలో రచింప బడ్డాయి. సంస్కృతంలో రచించిన కృష్ణలీలాతరంగిణి యక్షగాన రచనద్వారా అజరామరమైన కీర్తి నార్జించాడు. ఇది శ్రీకృష్ణ సంకీర్తనం. ఇది శ్రీకృష్ణ తత్త్వబోధనామృతం. భాగవతంలోని దశమ

స్కాందంలో గల శ్రీకృష్ణావతార ప్రధాన ఘట్టాలను సంగ్రహించి, విస్తరించి తీర్థులవారు కృష్ణలీలాతరంగిణిని 12 తరంగాలుగా (అంకాలుగా) రచించారు.

శ్రీ సిద్ధేంద్ర యోగి క్రీ. శ 1600 - 1700 సం॥ముల మధ్య వాడట. భామాకలాపం (పారిజాతం), గొల్లకలాపం సిద్ధేంద్రుని రచనలు: 'భామ్మక్రోధే'. భామ అంటే వెంటనే కోపంవచ్చే వనిత అని అర్థం. కలాపం అంటే విస్తరించి విపించటం. సత్యభామ తనకు కృష్ణునకు మధ్య నడచిన ప్రణయ కలహ వృత్తాంతాన్ని విస్తరించి చెప్పినది గాన అది 'భామాకలాపము' అయింది. అదే విధంగా గొల్లపడుచుకి బ్రాహ్మణునకు మధ్య సాగిన వృత్తాంత విస్తరణం 'గొల్లకలాపం' అయింది. సిద్ధేంద్రుడు యవ్వనంలో శృంగార ప్రధానంగా 'భామాకలాపం' రచించారు. ఆధ్యాత్మిక ప్రవృత్తిలో, ముసలివృత్తిలో ధార్మిక భావనా ప్రధానంగా 'గొల్లకలాపం' సంతరించారు. మొదటిది ప్రవృత్తి మార్గం. రెండవది నివృత్తిమార్గం ఆది ఆనందం. అంతం ఆనందం. ఆద్యంతాలు ఆనంద స్వరూపాలు. ఆద్యంతాలు లేని అనంతుడు ఆనంద స్వరూపుడు. ఆ ఆనంద స్వరూపుని లీలా కలాపమే 'భామాకలాపం' 'గొల్లకలాప' మూను. కూచిపూడి సమీప గ్రామం మొవ్వ. మువ్వగోపాల ముద్రతో క్షేత్రయ్య సుమారు 4500 నేడు సుమారు 400 పదాలు మాత్రం మిగిలాయి. పదాలు రచించాడు.

తంజావూరుకు చెందిన భరతనాట్యం, కేరళలోని కథాకళి, అస్సాంలో మణిపురి, ఉత్తర హిందూదేశపు, కథక్ ప్రాచీన భారత నృత్యరీతులుగా ఖ్యాతిగడించాయి. ఆంధ్రుల ప్రత్యేక నృత్యం కూచిపూడి నృత్యం. ఆంధ్రుల కూచిపూడి నృత్యం భరతనాట్యానికి మూలాధారం. ఆంధ్ర నాట్యమైన కూచిపూడి నృత్యం తంజావూరుకు వలస వెళ్ళింది. తరలి వెళ్ళింది. ఆంధ్రుల కూచిపూడి నృత్యం కొన్ని

మార్పులు, చేర్పులతో తంజావూరులో భరతనాట్య రూపం సంతరించుకొంది. ఆ భరత నాట్యంలోని అభినయ విభాగానికి సంగీత సాహిత్యాలు అందించిన ఆంధ్ర వాగ్గేయ కారుడు క్షేత్రయ్య. ఇతడు కూచిపూడికి మైలున్నర దూరంలోని మొవ్వ గ్రామ నివాసి.

కూచిపూడిలోనివి అన్నీ బ్రాహ్మణ కుటుంబాలే. ఆ కుటుంబాలలో పుట్టే ప్రతి బాలుడూ చెవులూ, ముక్కూ కుట్టించుకోవాలి. కాళ్ళకు గజ్జెలు ధరించి, లాస్య ప్రధానమైన స్త్రీల నృత్యం నేర్చుకోవాలి. జీవితంలో ఒకసారైనా నటరాజస్వామి సన్నిధిలో నృత్య ప్రదర్శనం ఇవ్వాలి. దీన్ని కాదన్నవారు కష్టనష్టాల పాలవుతారట. సిద్ధేంద్రయోగి ప్రవేశపెట్టిన ఈ సంప్రదాయం నేటికీ కొనసాగుతోంది. కూచిపూడి నృత్య కళాకారులకు శరీర వ్యాయామ, సంగీత, సాహిత్య నృత్య, అలంకార శాస్త్రాలలో శిక్షణ ఇస్తారు. భరతుని నాట్య శాస్త్రం, నందికేశ్వరుని అభినయ దర్పణం వంటి నాట్యశాస్త్ర గ్రంథాల ఆధారంగా కూచిపూడి నృత్యరీతులు సృష్టించారు. మెత్తగా బాడిద చెక్కతో వాటితో 32 స్త్రీల ఆభరణాలు, డాలు, కత్తి వంటి 10 పురుషుల ఆభరణాలు వారే తయారు చేసికొని ఉపయోగించేవారు. జయదేవుని గీత గోవిందాన్ని నారాయణ తీర్థుల తరంగాలను, క్షేత్రయ్య పదాలను కూచిపూడి కళాకారులు అభినయిస్తారు. లీలాశుకుని కృష్ణకర్ణామృత శ్లోకాలను సాభినయంగా ప్రదర్శిస్తారు. పెదపులివర్రుకు చెందిన సిద్ధాంతుల రంగదాసు రచించిన దశావతార శబ్ద ప్రదర్శనలో, మేలట్టూరు కాశీనాథయ్య రచించిన మండూక శబ్ద ప్రదర్శనలో కూచిపూడి కళాకారులు సిద్ధహస్తులు. ప్రహ్లాద, రుక్మాంగద, హరిశ్చంద్ర, ఉషాపరిణయం వంటి సంగీత నృత్య నాటక ప్రదర్శనలలో వీరు సుప్రసిద్ధులు. కూచిపూడిలో స్థాపింపబడిన శ్రీసిద్ధేంద్ర కళాక్షేత్రం వివిధ ప్రాంతాలకు చెందిన నాట్య కళాకారులు వసతి కల్పించి కూచిపూడి నృత్యరీతులలో శిక్షణ ఇస్తోంది.

కూచిపూడి నృత్య కళాభారతికి అమూల్యమైనసేవలు కావించిన ధన్యులు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు. వారు అసంఖ్యాకంగా కూచిపూడి నాట్యకళాకారులను తయారు చేసారు. వారివద్ద కూచిపూడి నృత్య శిక్షణ పొందిన వారిలో సుప్రసిద్ధ కళాకారిణి శ్రీమతి యామినీ కృష్ణమూర్తి ముఖ్యులు. శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి తమ 70వ యేట ప్రదర్శించిన కూచిపూడి నృత్యం తిలకించిన ఉదయశంకర్, రాగిణీదేవి ప్రభృతులు కూచిపూడి ఆంధ్ర నృత్య విశిష్టత గ్రహించి ప్రశంసించారు. వెంపటి సత్యం, పసుమర్తి వేణుగోపాల శర్మ, చింతా కృష్ణమూర్తి, వేదాంతం సత్యనారాయణశర్మ, కోరాడ నరసింహారావు, ఇంద్రాణీ రహిమాన్ ప్రభృతులు కూచిపూడి నృత్య ప్రాభవ వైభవాలకు కృషి చేసారు, చేస్తున్నారు. ఆంధ్రనృత్య భారతి జన్మభూమి కూచిపూడిని కృష్ణాపుష్కర సమయంతో సందర్శించి అంజలి ఘటిద్దాము.

శ్రీ వేంకటేశ్వరుని ఆదేశంతో, ఆశీర్వాదంతో అన్నమయ్య స్వామిపై 32 వేల సంకీర్తనలు కావించాడు. శ్రీనివాసుని వరం మూలంగా అన్నమయ్య ఆడినమాట అమృత కావ్యమైంది. పాడిన పాట పరమ గానమైంది. అన్నమయ్య ఆదివాగ్గేయకారు డయ్యాడు. అది 17వ శతాబ్దం. కృష్ణా మండలంలోని మొవ్వ గ్రామంలోని మువ్వ గోపాలస్వామి దివ్య దేవాలయ ప్రాంగణం. తరుణ వయస్సులోని వరదయ్య రాత్రి గోపాలదేవుణ్ణి ధ్యానిస్తూ సన్నిధిలో ఉన్నాడు. పూజారులు స్వామికి పవ్వళింపు సేవచేసి వెళ్ళిపోయారు. వరదయ్య ధ్యానంలో తెల్లవారింది. కన్ను తెరచాడు వరదయ్య. ముందర గోపాలకృష్ణయ్యను చూచాడు. మువ్వగోపాలుడు "వరదయ్యా! మధుర భక్తి భరితమైన, దివ్య శృంగార పూరితమైన పదాలు నాపై పాడవయ్యా! క్షేత్రాలు దర్శించి క్షేత్రయ్యవవుతావు. రాజాస్థానాలు చూచి రాజ సన్మానాలు అందుకొంటావు. నీ పదాలు గోపాలదేవుని

తాళ్ళపాక వారి దివ్యపథాలు". అని వరదయ్యను దీవించాడు. కూచి పూడి కళాక్షేత్రంలో నేర్చుకొన్న సంగీతం, సాహిత్యం, నాట్యం సమ్మే ళనం కావించి వరదయ్య మువ్వగోపాల పదాలు పాడడం ప్రారంభిం చాడు. మువ్వగోపాలుని మహిమను దేశవ్యాప్తం చేయడం జీవితాశ యంగా స్వీకరించాడు. మువ్వగోపాలునిపై పాడడం, మువ్వగోపాలుని కోసం పాడడమే వరదయ్య లక్ష్యం. అది ఒక మధుర పదకవితా తపస్సు. చివరకు మువ్వగోపాలునిలో లీనం కావడమే అతని చివరి కోరిక. మొదటి కోరిక. అదే అతని ఒకే ఒక కోరిక. మువ్వగోపాలుని విశ్వ రూపాన్ని తాను దర్శించిన అన్ని క్షేత్రాలలో చూచాడు. తాను ప్రవేశించిన ప్రతి రాజాస్థానంలోను మువ్వగోపాలుని దివ్య మహిమను ఆవిష్కరించాడు.

గోల్కొండ, మధుర, తంజావూరు ఆస్థానాలలో కొన్ని సంవత్స రాలు గడిపాడు. గోల్కొండ నవాబు అబ్దుల్లా కుతుబ్షా మన్ననలు అందుకొన్నాడు. తెలుగు రాజభాషగా ఉన్న రాజ్యాలకు - తెలుగుకు రాజాదరణ, రాజపోషణ ఉన్న రాజ్యాలకు మాత్రమే వెళ్ళాడు క్షేత్రయ్య. క్షేత్రయ్య గోల్కొండ తరువాత మధురకు వెళ్ళాడు. తిరుమల నాయకుడు మధురై పాలకుడు. వరదయ్యకు మధుర హార్దిక మైన స్వాగత సన్మానాలు అందించింది. వరదయ్య పదాలకు రాజాద రణ, ప్రజాదరణ లభించింది. వరదయ్య మీనాక్షిని సేవించి ధన్యుడ య్యాడు. తరువాత నెల దినాలు కంచిలో ఉన్నాడు. శివకంచి చూచాడు. కంచి అతణ్ణి అలరించింది. వరదరాజస్వామి దేవాలయం చూచి తన్మయుడయ్యాడు. కంచి వరదునిపై వరదయ్య పదాలు రచించి గానం చేసాడు. ఒకనాటి రాత్రి వరదరాజస్వామి దేవాలయంలో ధ్యానంలో ఉండగా అతని ఉనికిని గమనించని పూజారి గుడితలుపులు తాళంవేసి వెళ్ళిపోయాడు. తెలతెలవారుతోంది. వరదయ్య ధ్యానం ముగిసింది. వరదయ్య స్వామి సన్నిధానం నుండి తొందరగా అమ్మ

వారు తన మందిరానికి వెళ్ళుతున్న దృశ్యం కనబడింది.

" మగువ తన కేళికా మందిరము వెడలెన్
వగకాడ, మా కంచి వరద ! తెల్లవారె ననుచు - మగువ ||
విడజారు కొజ్జంగి విరిదండ జడతోను
కడుచిక్కువడి పెనగు కంట సరితోను
నిడుద కన్నులదేరు నిదురమబ్బు తోను
తొడరి మదయుగమున తడబడు నడతోను - మగువ ||
ఇరుగడలకై దండలిచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వగోపాల తెల్లవారెననుచు — మగువ"

వరదయ్య చూచిన దృశ్యానికిది అక్షరరూపం. సంగీత రూపం. నృత్యరూపం, ఈ క్షేత్రయ్య పదం సంగీత, సాహిత్య నృత్యాల త్రివేణీ సంగమం ! క్షేత్రయ్య పదాలన్నీ, గీత, సంగీత, నృత్యసమ్మేళన ప్రయోగ ప్రయాగ క్షేత్రాలే !

తంజావూరు నేత విజయరాఘవ నాయకుడు కంచిలోని వరదయ్యను తంజావూరుకు విజయంచేయుమని ఆహ్వానించాడు. తంజావూరు ఆస్థానంలో వరదయ్య తంజావూరు రాజుల సత్కారాలు అందుకొని సేతు యాత్రకు బయలు దేరాడు. శ్రీరంగ క్షేత్రం దర్శించాడు.

శ్రీరంగనాథుని పాదాలముందు తన పద పూజాపుష్పాలు సమర్పించాడు, శ్రీరంగం నుండి రామేశ్వరం చేరుకున్నాడు. సేతు స్నానం చేసి రామలింగేశ్వరుణ్ణి చూచి వరదయ్య సంతోషాంతరంగుడయ్యాడు. తంజావూరు గోల్కొండ రాజాస్థానాలు దర్శించి గోల్కొండ మీదుగా స్వగ్రామానికి చేరుకొని మువ్వగోపాలుని సేవించాలని సంకల్పించుకొన్నాడు. తంజావూరు దర్శించి గోల్కొండ వచ్చాడు. 40 దినాలలో

1500 పదాలు రచించమని గోల్కొండ నవాబు ప్రార్థించగా వరదయ్య అంగీకరించాడు. భారం మువ్వగోపాలునిపై వేసి 39వ రోజున రాత్రి 1500 పదాలు రచించి 40వ రోజన నవాబుకు అందజేసి వరదయ్య ఘన సన్మానాలు పొందాడు. భద్రాచలం, శ్రీశైలం, తిరుమల దర్శించి, మొవ్వగ్రామానికి వచ్చాడు. ఆ నాడు శ్రీ కృష్ణ జన్మాష్టమి. మువ్వ గోపాలుని ముందు క్షేత్రయ నిలచాడు. తన్మయుడై స్వామిపై పదాలు పాడుతున్నాడు. స్వామిని చూస్తున్నాడు. స్వామిపై గానం చేస్తు న్నాడు. క్షేత్రయ్య భక్త్యావేశం, పదకవితా వేశం ఒక దివ్యావేశంగా మారి దాని నుండి అతని ఆత్మతేజం వెలువడి మువ్వగోపాల దేవుని దివ్య తేజంలో లీనమైనది.

ఈ అపూర్వమైన సంఘటన జరిగింది కృష్ణాజిల్లాలోని మొవ్వ గ్రామంలో. ఈ దివ్య సన్నివేశం రూపుదిద్దుకొన్నది మువ్వగోపాలుని పాదసన్నిధానంలో. ఈ కృష్ణా పుష్కర సమయంలో మొవ్వకు వెళు దాము. మువ్వగోపాలుని చూదాము !

శ్రీ లక్ష్మీపతి దివ్యదేవాలయంగల పవిత్ర క్షేత్రం పెదముక్తేవి. ఇది కృష్ణాసాగర సంగమ స్థలికి సమీపంలోని వైష్ణవ క్షేత్రం. దీనికి తూర్పున భీమనది ఉంది. ఒక నాడు ఈ ప్రాంతం అరణ్య ప్రాంతంగా ఉండేదట. మునుల తపో భూములు. ఋషుల ఆశ్ర మాలు వెలసిన పరమ పవిత్ర ప్రాంతం అది. అవి కృష్ణా తీరం పొడవునా ఉండేవట. అవనిగడ్డ వశిష్ట ఆశ్రమం. పులిగడ్డ వ్యాఘ్ర మహర్షి ఆశ్రమం. శ్రీకాకుళం అత్రి మహర్షి ఆశ్రమ ప్రాంతం. వ్యాఘ్ర పాద ఆశ్రమంగల తావు పువిపర్రు. చవన్ముని ఆశ్రమంగల నెలవు చ్యవలూరు. వ్యాస భగవానుని ఆశ్రమ కేంద్రం ముక్తేవి. లక్ష్మీపతి పాద భక్తే ముక్తి. లక్ష్మీపతి ఈవిముక్తి. భక్తుల శ్రీపతి

భక్తి 'ముక్తేప'. అది నేడు పెద ముక్తేవి అని పిలవబడుతోంది.

పెద ముక్తేవిలోని లక్ష్మీపతి మూర్తి దివ్య సుందరమూర్తి. స్వామివారి కుడిచేతి చిటికెనవేలు గోటిపైన 6 అంగుళాల శంఖం నిలబడి భక్తులకు కనపడుతుంది. భక్తితో ముక్తి పొందడమనే శంఖారావం చేస్తూన్నట్టు గోచరిస్తుంది. స్వామి దక్షిణ పార్శ్వంలో విద్యాగణపతి విగ్రహం ఉంది. పాత గుడి పాడుపడగా చోళరాజులు మరల గుడి కట్టించారు. మహమ్మదీయ దండయాత్ర సమయంలో విగ్రహం అదృశ్యమైంది. తరువాత ముక్తేవి పెరుమాళ్ళయ్య అనే భక్తునకు కలలో కనపడి తనను భీమనదినుండి తీయమని చెప్పాడు. భక్తులు అన్వేషించి స్వామి విగ్రహం కనుగొనడంలో విఫలమయ్యారు. "స్వామీ! మీ పాదదర్శన భాగ్యం కలిగించడని' భక్తులు ఆర్తితో ప్రార్థించగా స్వామి విగ్రహం లభించింది. విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. కృష్ణా నదీ పుష్కర సమయంలో పెదముక్తేవి లక్ష్మీపతిని పూజించి, తరించుదాము.

తరువాత చూడవలసిన క్షేత్రం మోపి దేవి సుబ్రహ్మణ్యక్షేత్రం. మోపి దేవి అవనిగడ్డకు నాలుగుమైళ్ళ దూరంలో ఉంది. మోపిదేవి సుబ్రహ్మణ్య క్షేత్రం అగస్త్య మహర్షి పూజలు, సేవలు అందుకొన్న సుప్రసిద్ధ పుణ్యక్షేత్రం. సంతానార్థులైనవారు స్వామిని దర్శించి, సేవించి కృతార్థులవుతున్నారు. క్షేత్రపాలకుడు నకలేశ్వరుడు. అగస్త్య మహర్షి చేత ప్రతిష్ఠింపబడినాడట.

ఇంకొక దర్శనీయమైన తావు హంసల దీవి. ఇది కృష్ణా సాగరసంగమ క్షేత్రం. ఇది స్వయంవ్యక్త వేణుగోపాల క్షేత్రం ఉల్లిపాలెం హంసలదీవి అసలుపేరు. ఇది హంసలదీవి కావడం దైవ నిర్ణయం. గాంగానది తనపాపంపోగొట్టు కోవడానికి ఇక్కడికి కాకి

రూపంలో వచ్చి కృష్ణలో స్నానంచేసి పవిత్రమైన హంసగా మా
అందుచేత ఇది హంసలదీవి అయిందట. పరమ హంసలుగా
ఎందరో మహానుభావులు శ్రీ వేణుగోపాలక్షేత్రం దర్శించడ
క్షేత్రవాసం చేయడంచేత ఇది హంసల దీవిగా ప్రఖ్యాతమైంది.
నది ఇక్కడకు రాగానే సాగరుడు 'ప్రేయసీ' అంటూ పలకరించా
హరిహర బ్రహ్మాది దేవతలు ఆధ్వర్యం వహించి కల్యాణో
కావించారుట. కృష్ణ పెండ్లికి వచ్చిన శ్రీకృష్ణుడు గోపాలుడు
కృష్ణాసగరుల వివాహం చేయించిన శివుడు సంగమేశ్వరుడుగాను
ర్భవించారు. గోపాల సంగమేశ్వరులు ఒకేఆలయంలో,
ప్రాకారంలో ఉండడం విశేషం. ఇది శంకర నారాయణక్షేత్రం.

"లలిత కృష్ణాబ్ధి సంగమ స్థల విహార
పరమ కరుణా స్వభావ గోపాలదేవ!"

అంటూ హంసలదీవి గోపాలదేవుని స్తుతించి, ప్రస్తు
పరమహంస జీవితం గడుపుదాము.

# కనకదుర్గ

"శ్రీమాతా లలితా ప్రసన్నవదనా శ్రీరాజరాజేశ్వరీ
విష్ణుబ్రహ్మమహేంద్రసేవితా సదా విశ్వేశ్వరీ శాంభవీ
కారుణ్యామృతవాహినీ రసమయీ కైవల్యసంధాయినీ
దుర్గాంబా నవకోటిమూర్తిసహితా మాంపాతు మాహేశ్వరీ"

— కరుణశ్రీ

శ్రీ కనకదుర్గ నెలవుకు "దుర్గాక్షేత్ర"మని పేరు. మంగళగిరి వరకు విస్తరించి ఇంద్రకీలాద్రి కృష్ణానదికి సాగరసంగమయోగంలేని స్థితి కల్పించింది. దేవతల కోరిక మేరకు పర్వతరాజు విజయవాడ సీతానగరంమధ్య కృష్ణకు సారంగమార్గం కల్పించాడు. కృష్ణానదీ వేగానికి పర్వతం బ్రద్దలై బిమ్మెళ్ళమార్గంలో ఎనుములకుదురువద్దపడింది. కాలక్రమాన కనకదుర్గ ఆవిర్భావ హేతువుచేత ఇది కనకదుర్గాదేవి దివ్యక్షేత్రమైంది.

కృష్ణానది సాగరసంగమంకోసం పర్వతరాజుపై విజయం సాధించడంచేత కృష్ణానదీతీరానకల జనావాసం విజయపురి అయింది. దుర్గాభవానీ దుర్గమాసురుణ్ణి, మహిషాసురుణ్ణి, శుంభనిశుంభ రాక్షసులను జయించి విజయంసాధించి ఇంద్రకీల నివాసినిఅయింది. ఆ విజయదుర్గ వెలసిన పర్వతపాదంలోని ప్రాంతం జయపురి, విజయపురిగా విఖ్యాతమైంది. అర్జునుడు ఇంద్రకీల పర్వతంపైన తపోవిజయం సాధించడం, శివసాక్షాత్కారవిజయం పొందడం, పాశుపతాస్త్రం సంపాదించడంలో విజయం హస్తగతం చేసుకోవడం మూలంగా ఇంద్రకీల పర్వతమూలంలోని పట్టణం విజయవాడగా

ప్రఖ్యాతి పొందింది. అర్జునుడు విజయుడు కావడంవలన విజయవాడ వెలసింది. ఇంద్రకీల పర్వతంపైన అర్జునుడు విజయేశ్వరుని, బ్రహాస్త్రేశ్వరుని ప్రతిష్టించడంమూలంగా విజయవాడ అయింది. దుర్గమాసురాది రాక్షసులపై విజయ సమయంలో స్వర్ణ తేజస్సుతో దుర్గాదేవి గోచరించడంమూలంగా దేవతలు దుర్గను కనకదుర్గ అన్నారు. కనకదుర్గవలన విజయవాడ కనకపురి అయింది. దుర్గాదేవి కనక ప్రభలు ప్రసరించడంచేత విజయవాడ కనకవాడఅయింది. దుర్గ వెలసిన ఇంద్రకీలపర్వతం రత్నగర్భ కావడంవలన దుర్గ కనకదుర్గ అయింది. కనకదుర్గాక్షేత్రం కనకపురమైంది. ఇంద్రకీలపర్వతం అర్జునుని తపోభూమి కావడంవలన ఫల్గుణక్షేత్రంగా పిలువబడింది. పూర్వం మాధవవర్మ అనే రాజు ఉండేవాడు. ఒక స్త్రీ చింతచిగురు అమ్ముకొని జీవించేది. ఈమె కుమారుడు మాధవవర్మ కుమారుని రథంక్రిందపడి మరణించాడు. రాజు రాజకుమారునకు ధర్మరక్షణా, న్యాయపరిరక్షణకోసం మరణదండన విధించాడు. మాధవవర్మ ధర్మనిరతికి సంతోషించి చినుకుకు చిన్నముత్యంతున కనకవర్షాన్ని రాజకుమారుని మృతదేహంపైన, పేదబాలుని మృతదేహంపైన, దుర్గాదేవి కురిపించి కనకదుర్గయై ప్రసిద్ధిపొందింది. ఆమె నివాసం "కనకపురి" "కనకవాడ" అని పిలువబడ్డాయి. శాసనాలలోకూడా "కనకపురి", "కనకవాడ"గా పేర్కొనబడ్డాయి.

"బీజానాం వాపనం త్వాసీత్తదా బీజపురీహ్యభూత్" అని స్కాందపురాణ వచనం. కృష్ణానది తాను ప్రవహించే మార్గంలో ఉన్న అసంఖ్యాకములైన అమూల్య మహౌషధీ బీజాలను కొనివచ్చి

నాటబడిన "విజయపురి" బీజపురి అయింది. బీజపురి తరువాత కాలంలో బెజవాడ అయింది. ఇది బిజ్జలదేవుని రాజధాని కావడంవలన బిజ్జలవాడగా వ్యవహరింపబడింది. బౌద్ధయుగంలో అత్యంత ప్రవాహ సమృద్ధిగల కృష్ణానదిలో మత్స్యసంపద, సంతతి విశేషంగా ఉండేదట. అమరావతి ఆదిగాగల బౌద్ధ పుణ్యక్షేత్రాల సందర్శనకు వచ్చిన చైనాయాత్రికులు మత్స్యసంతతి గల కృష్ణానదిని మైసోలాస్ అని పిలిచారు. ఆనాటి కృష్ణాతీరంలోని బెస్తవాడ బెజవాడగా మారిందని భాషాపరిణామ శాస్త్రజ్ఞుల ఉద్దేశం. శాసనాలలో విజయవాడ రాజేంద్రచోళపురంగా వ్యవహార ప్రాచుర్యం పొందింది. చోళరాజుల పాలన ఇంద్రకీలాద్రి దుర్గంనుండి సాగింది. విజయవాడ కనకపురి అనే పేరుతో వేంగీరాజ్య రాజధానీనగరంగాను, కొంతకాలం రెడ్డి రాజుల రాజధానీనగరంగాను వర్ధిల్లింది. 7వ శతాబ్దంనుండి క్రీ.శ. 8౹౹వరకు విజయవాడ తెలుగురాజుల పాలనావైభవానికి కేంద్రమైంది. 8వ శతాబ్దానికి చెందిన 3వ విష్ణువర్ధనుని శాసనంలో, 10వ శతాబ్దానికి చెందిన బెజవాడ యుద్ధమల్లుని శాసనంలో ఈపట్టణం బెజవాడగా పేర్కొనబడింది. ఇటీవల బయల్పడిన ఇంద్రకీలాద్రిలోని గుహ పురావస్తు ఆధారాలనుబట్టి క్రీ. పూ. 2వ శతాబ్దానికి చెందినదిగా భావింపబడుతోంది. క్రీ.పూ. 339 సం॥ములో నాటి చైనాయాత్రికుడు హ్యూయన్‌సాంగ్ రచనలనుబట్టి తెలుస్తూన్న రెండు ఆరామాలలో బెజవాడ బౌద్ధఆరామం ఒకటి.

9వ శతాబ్దారంభంలో ప్రథమ విజయాదిత్యుడు ఒక ఈశ్వరాలయం విజయవాడ ప్రాంతంలో నిర్మించాడు. క్రీ.శ. 1000 సంవత్సరములో పంచాయతీ నాయకుడైన మువ్వరణం రామిశెట్టి భ్రమరాంబా మల్లేశ్వర ఆలయానికి 1000 స్తంభాల మండపం

నిర్మించాడట. అది మొగల్రాజపురం వరకు ఉండేదంటారు. విజయవాడకు తూర్పుగా ఉన్న 'మొగల్‌రాజపురం' కొండమీద మూడు గుహాద్వారాలు మూసినట్లు కనపడుతుంటాయి. అవి కనకదుర్గమ్మ ధనాగారములని, దేవిదృష్టి వానిపై ప్రసరిస్తూంటుంది అని ఒక ప్రతీతిఉంది. చోళరెడ్డిరాజులనుండి దేశాన్ని జయించిన మొగలాయీ చక్రవర్తులు రాజధానిని కొండపల్లికి తరలించుకొన్నా, సైనిక దళాలనుమాత్రం మొగల్రాజపురంలో ఉంచారు. ఇది మొగలాయీ చక్రవర్తుల సైనికదళాలకు విడిదికావడం వలన మొగల్రాజపురమైంది. కొండక్రింద మూడుకొండగుహాలు—వానికిఎదురుగా మూడుమంటపాలు ఉన్నాయి. ఇవి బౌద్ధ సన్యాసుల నివాసస్థానాలుగా, బౌద్ధ విహారాలుగా, మఠాలుగా ఉండేవట. శాసనానుబట్టి ఈ గుహాలు 5వ శతాబ్దంనాటివిగా గుర్తింపబడినవి. ఇచ్చట నటరాజ వినాయకాది విగ్రహాలున్నాయి. ఇందులోని అర్ధనారీశ్వర విగ్రహం దక్షిణభారత దేశంలో ఉత్తమ కళాఖండంగా, విశిష్ట కళారూపంగా గుర్తింపబడింది. ఇది నేడు పురావస్తుశాఖవారి పరిరక్షణలో పదిలంగా ఉంది.

విజయవాడ కాకతీయుల పరిపాలనావైభవాన్ని అనుభవించింది. కాకతీయప్రతాపరుద్రభూపతి విజయవాడనుదర్శించి ధన్యుడయ్యాడు. కృష్ణానదిని సేవించాడు. కనకదుర్గమ్మను పూజించాడు. శ్రీ కృష్ణదేవరాయలు విజయవాడలో కొన్నిదినాలు ఉండి, కృష్ణలో స్నానం చేసినట్లు, దేవాలయాలకు భూరి విరాళాలు సమర్పించినట్లు తెలుస్తోంది. క్రీ.శ. 1673వసం॥లో ఫ్రెంచియాత్రికుడు 'టావర్నియర్' విజయవాడను సందర్శించి, అది 19.3 కి.మీ. విస్తీర్ణం కలిగిన నగరమని తనరచనలలో వివరించాడు. 17వ శతాగోల్కొండను పాలించిన

తానీషా మంత్రులైన అక్కన్న మాదన్నలకు ప్రధాన కార్యస్థానం విజయవాడ నగరం. ఇంద్రకీలాద్రిపైన అక్కన్న మాదన్న గుహాలు ఉన్నాయి. అకన్న మాదన్నలు ఈ గుహాద్వారాల గుండా గోల్కొండ నవాబు వద్దకు ప్రభుత్వ కార్యాల చర్చల నిమిత్తం వెళ్ళివచ్చేవారట. ఇక్కడ నృసింహ బిలం ఉంది. ఇది యోగశాస్త్ర కేంద్రంగా, ముని జనాశ్రమంగా ప్రఖ్యాతిపొందింది. విజయవాడ నుండి విధ్యాధరపురము వెళ్ళే మార్గంలో పర్వతపు మధ్యభాగంలో నేడు మూయబడిన గుహాయే నృసింహబిలం. బిలద్వార వద్ద ఇరుకుగాను, తరువాత విశాలం గాను ఉంటుందిట. దీని ఉనికి నేడు శిలాశాసనంలోనే కనపడుతోంది కాని మరెక్కడా కనపడడంలేదు కిరాతార్జున స్తంభం నుండి క్రిందికి దిగేచోట మధ్యభాగంలో ఒక గుహ, ప్రాకారం ఉన్నాయి. మహా భక్తుడైన గోవిందుడనే హరిజనుడు దీనిలో నివసించడం వలన ఇది గోవిందగుహా, గోవింద మఠం అని పిలువబడుతోంది. ఇది విజయవాడ కనకదుర్గా క్షేత్రపు చారిత్రకపు వైభవం.

పూర్వం శాక్తేయుడైన ఇంద్రకీలుడనే యక్షుడు ఈశ్వరిని గూర్చి తీవ్రమైనతపస్సు కావించాడు. ఇంద్రకీలునకు దేవిసాక్షాత్కారం జరిగింది దేవి వరం కోరుకోమంది. "నీవు సదా నా శిరస్సుపై అధిష్టించి ఉండడమే నా అభిమతం" అని ఇంద్రకీలుడు దేవిని అర్థించాడు. "నీవు శైలరూపం ధరింపుము. నీపై నేను నివశిస్తాను" అని దేవి అభయమిచ్చింది." తతః కీలగిరిం దేవి తాచ్ఛగ విస్మయంగతా తం కీలాద్రిం స్వర్ణమయం సర్వదేవమయోగిరిః నృసింహోవాస పర్యంతంకీల రూపేణ వర్తతే స్థితో ద్వైఘ్యేణ కీలాద్రిః కీలావద్వర తే తథా" దేవివచనం ప్రకారం ఇంద్రకీలుడు ఇంద్రకీల పర్వతమయ్యాడు. ఇంద్రకీలాద్రి

నృసింహాద్రిదైన మంగళాద్రి వరకు వ్యాపించింది. దుర్గమాసురుని, మహిషాసురుని, శుంభ నిశుంభుల్ని సంహరించిన దేవిదుర్గగా ఇంద్ర కీలాద్రిపైన ఆవిర్భవించింది. సతీవియోగ సమయంలో సతీదేవి మృత దేహం శివుడు ధరించి విహరించసాగాడు. శ్రీ హరి చక్ర ప్రయోగం వలన సతీదేవి మృతదేహం యాభై శకలాలై భారతదేశంలో వివిధ ప్రాంతాలలో నిక్షిప్తమయ్యాయి. అవి యాభై దేవీ పీఠాలుగా వెలసాయి. ఆ 51 దేవీ పీఠాలలో కనక దుర్గాదేవీ పీఠం ఒకటి. దేవీ భాగవతం, దుర్గాసప్తశతి ఆధారంగా 108 దుర్గా క్షేత్రాలు భారతదేశంలో విస్తరించినట్లు తెలుస్తోంది. వానిలో 18 దుర్గాక్షేత్రాలు ప్రముఖమైనవిగా గుర్తింపబడ్డాయి. వీనిలో విజయవాడ కనకదుర్గా క్షేత్రం అత్యధికమైన ప్రశస్తిపొందింది అఖిలభారతవిఖ్యాతి, ప్రపంచఖ్యాతి పొందిన ఏకైక ఉత్తమ దుర్గాక్షేత్రం ఆంధ్ర దేశంలోని విజయవాడ కనకదుర్గా మహాక్షేత్రం.

"దుఃఖే నాపి అవగంతుం అశక్యాదుర్గా" అన్నది దుర్గానామానికి వ్యుత్పత్తి అర్థం. దుర్గ అంటే కష్టం మీదకాని స్వాధీనంకాని దేవత అని అర్థం. దుర్గము అంటే కోట — కోటవలె భక్తులను రక్షిస్తుంది. కనుక శివునికి దుర్గానామం ప్రీతి పాత్రం. నవదుర్గల ప్రశంస మనకు సపరిచితమైనది! స్థల దుర్గ, వనదుర్గ, నదీదుర్గ, పర్వతదుర్గ సాగరదుర్గ, గ్రామదుర్గ, పట్టణదుర్గ, చండీదుర్గ, (రణదుర్గ), శూలినీదుర్గ అన్నవి నవవిధ దుర్గా స్వరూపాలు. నవదుర్గాశక్తులు. ఆ నవవిధ అంశాలకు కోటవలె ఉండి, ఆ నవ అంశాలతో సంబంధం కలిగిన జీవులకు రక్షణ కల్పించడానికి దుర్గ నవదుర్గా స్వరూపాలు సంతరించుకొంది. ఆవిధంగా నవదుర్గా స్వరూపాల, శక్తులకు సంబంధించిన ఆ

రాధనం అష్ట సిద్ధులు, నవనిధులు ప్రసాదిస్తుంది. దేశంలోని వివిధ ప్రాంతాలలో దుర్గ వివిధ నామాలతో పిలువబడి పూజింపబడుతోంది.

| దుర్గాపూజ చేసే ప్రాంతం పేరు | ఆ ప్రాంతంలో పూజింపబడేదుర్గ పేరు |
|---|---|
| హిమాచలప్రాంతం | హైమావతి |
| కాశ్మీరు | శైలపుత్రి |
| వంగదేశం | కాళి |
| మహారాష్ట్రం | వింధ్యవాసిని |
| ఉత్కళదేశం | ఓంకారి |
| దక్షిణప్రాంతం | కౌమారి |
| కర్ణాటక | చాముండి |
| మళయాళదేశం | భగవతి |
| గయ | గౌరి |
| హరిద్వారం | మహామాయ |
| ఉజ్జయిని | మహామాయ |

జగద్రక్షకత్వ, జగద్వ్యాపకత్వ, జగన్మాతృత్వశక్తులను దుర్గా శక్తి భక్తులకోసం సదా ప్రకటిస్తోంటుంది. దుర్గ దుష్ట శిక్షణకోసం శాంతస్వరూపం ధరిస్తుంది. ఇది దుర్గా స్వరూప నిరూపణం. కృత యుగంలో ఇంద్రకీలుడు దుర్గను సేవించాడు. త్రేతాయుగంలో ఇంద్రుని తనయుడైన అర్జునుడు దుర్గను పూజించాడు. కలియుగ మానవులు ఇంద్రకీలునివలె, ఇంద్రునివలె, ఇంద్ర తనయునివలె దుర్గను సేవించి, అర్చించి పూజించి తరించాలి. పరశురాముడు, రాముడు, కృష్ణుడు పంచ పాండవులు ఆదిగాగల పురాణ పురుషులు వశిష్ట, విశ్వామిత్ర, గౌతమ, అగస్త్య, భరద్వాజాది మహర్షులు కనక దుర్గను సేవించారు. మాధవవర్మ, ఆది శంకరులు, ప్రతాపరుద్రుడు, శ్రీకృష్ణదేవరాయలు, అక్కన్న మాదన్నలు కనకదుర్గను పూజించి ధన్యులయ్యారు.

" ప్రథమం శైలపుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ
తృతీయం చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకం
పంచమం స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతి చ
సప్తమం కాళరాత్రి శ్చ మహాగౌరీతి చాష్టమం
నవమం సిద్ధిదా ప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః

ఇది నవదుర్గల వర్ణనము. ఈ నవదుర్గలలో ద్వితీయ దుర్గ బ్రహ్మచారిణీ దుర్గ. బ్రహ్మచారిణీ దుర్గయే కనకదుర్గ. ఈమె రుద్రరూపిణి. మహాభయంకర స్వరూపిణి, ఆమె దృష్టికి ఎదురుగా నిలచిన వారు మరణించేవారు. అది ఆదిశంకరుల నాటిస్థితి. భయంకర పరిస్థితి. దుర్గ ఆగ్రహ దృష్టిని అనుగ్రహ పూరితమైన కరుణా దృష్టిగా మార్చినవారు ఆదిశంకరులు. అందుకోసం శాంతియంత్రమైన శ్రీ చక్రం, మేరుచక్రం రూపొందించారు. వానిని కనక దుర్గ వామపార్శ్వంలో ప్రతిష్ఠించారు. ఉత్తరపు దిక్కులో ఉన్న మల్లేశ్వరాలయాన్ని పునరుద్ధరించారు. రుద్రమూర్తి భద్రమూర్తిగా మారింది. భయంకర వదన ప్రసన్నవదన అయింది. అందరినీ అనుగ్రహించే మందస్మిత సుందర వదనారవిందయై వర్ధిల్లింది.

ఒరుగంటి ప్రతాపరుద్రుడు కనకదుర్గా క్షేత్రం దర్శించిన సమయంలో అచ్చట శాక్తేయ విజృంభణం కనిపించింది. వామాచారం విలయతాండవం చేస్తోంది. నరజంతుబలుల కార్యక్రమం యథేచ్ఛగా సాగిపోతోంది. ఈ అవైదిక వామాచార తంత్రం సాగనివ్వరాదని ప్రతాపరుద్రుడు కృత నిశ్చయుడయ్యాడు. వామాచారాన్ని అంతం చేయడానికి, వైదిక అర్చనా విధానం పునః ప్రతిష్ఠించడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం విజయవంతమైంది. పెదకళ్ళేపల్లి దుర్గానాగేశ్వరస్వామి అర్చకులు దేవీపూజాధురంధరులు పూర్ణదీక్షాపరు

లైన బుద్ధు ఉమాపతి చలపతి సోదరులు శాంతియంత్రం ప్రతిష్టలు చేసి వామాచారం అంతం కావించారు. వైదిక ఆచారం ప్రారంభించారు. కాశీ నుండి తమ ఉపాసనకు తెచ్చుకొన్న శివలింగాన్ని ఆ సోదరులు ఇంద్రకీల పర్వత పాదభాగంలో ప్రతిష్ఠించారు. అదే బ్రాహ్మణవీధిలోని శివాలయం. ఉమాపతిశాస్త్రి ఉపాసనకు కనకదుర్గ సంతసించి తన దక్షిణ భుజశకలం కానుకగా సమర్పించింది. శ్రీ ఉమాపతిశాస్త్రి దేవి ఆదేశం మేరకు ఓషధీరసం ద్వారా అది సంజీవకరణివలె పనిచేసి ఆమె దక్షిణ బాహువు యథాస్థితిలో ఉద్భవించి కనకదుర్గ సర్వాంగ సుందర విగ్రహం అయింది. ఇది కళ్ళేపల్లి కైఫియతు వలన తెలుస్తోంది. ఆ కనకదుర్గ దక్షిణ బాహుశకలం నేటికీ బుద్ధవంశంవారి దేవతార్చన పీఠంలో పూజలు అందుకొంటూంది. వారిసంతతివారు పూర్ణ దీక్షా పరులై, శ్రీ విద్యోపాసనా సిద్ధులై, సంగీత, సాహిత్య, పాండిత్యాలలో ప్రసిద్ధులై కనకదుర్గా దేవి కృపకు పాత్రులై వర్థిల్లు తున్నారు.

కనకదుర్గ విగ్రహంస్వయంభవం. దుర్గాసుర, మహిషాసురులను సంహరించిన స్వరూపంలో ఆవిర్భవించడం చేత కనకదుర్గ భీషణ రూపంతో గోచరిస్తుంది. అష్టభుజాలతో అతి భీషణంగా కనకదుర్గ విగ్రహం కనబడుతుంది. అరి, శంఖ, ఖేట, శూల, పాశ, అంకుశ, మార్గ, సాయకాది అష్టాయుధధారిణి కనకదుర్గ. భక్తులకు ఆమె సింహవాహనారూఢయై మహిషాసురుని శిరస్సును శూలంతో పొడుస్తూన్న భంగిమలో దర్శనమిస్తుంది. ఆగమశాస్త్రం అంగీకరించకపోయినా, దేశాచారం ఆమోదించే పసుపు అమ్మవారి వదనానికి పూయబడి ఉంటుంది. ఈ విధమైన అమ్మవారి దర్శనం భక్తులకు లభిస్తుంది. అమ్మ దర్శనం, విస్మయ, ఆనందాలు కలిగిస్తుంది. భక్తుల హృదయాలలోని భయ సందేహాలను తొలగిస్తుంది. "దేవీ చరణ సేవ శరణ్యం, దేవీ నామస్మరణం తరుణోపాయం" అనే దివ్యసందేశాలు అందిస్తుంది. రత్నాభరణభూషితయై, స్వర్ణకవచాలంకృతయై

అమ్మవారు త్రిభువన సుందరిగా, అతిలోక మనోహరిగా, చతుర్దశ జననిగా, లోకపావనిగా సాక్షాత్కరించి అలౌకికమైన, అనిర్వచనీయమైన ఆనందానుభూతి పరంపరలను భక్తమహాజనులకు అనుగ్రహిస్తుంది. అంధయుగంలోని మానవునకు విజయవాడ కనకదుర్గ దర్శనభాగ్యం లభించడం ఒక స్వర్ణయుగం. అమ్మవారి వామభాగంలోని గణపతికి లక్ష్మీగణపతి అని పేరు. దక్షిణభాగపు గుహాలో చింతామణి దుర్గావిగ్రహం ఉంది. అమ్మవారికి ఎదురుగా ఉన్న ఆంజనేయ దేవాలయం, ఉత్తరంలోని నటరాజాలయం దర్శనీయాలు. వానికి దక్షిణంలోని సిద్ధివినాయక, సుబ్రహ్మణ్య మూర్తులను, ఉత్తరంలోని కామేశ్వరీదేవి దివ్య విగ్రహాన్ని దర్శించి, సేవిస్తే భక్తుని హృదయం శాంతి నిలయమవుతుంది.

కనకదుర్గమ్మ అర్చకులు వెలనాటి అర్చకులు. వారు అమ్మవారికి శ్రీసూక్త విధానంలో నిత్యం ఉదయం లలితా సహస్రనామార్చన కావిస్తారు. ప్రతి శుక్రవారం, పూర్ణిమనాడు, శరన్నవరాత్రులలో, వసంతనవరాత్రులలో కనకదుర్గమ్మకు విశేషంగా పూజలు జరుగుతాయి. భోగాలు సమర్పింపబడతాయి. నవరాత్రి ఉత్సవాలు మహావైభవంగా జరుగుతాయి. కనకదుర్గకు విశేషమైన అలంకారాలు కావిస్తారు. మహావిద్యా పారాయణ జరుగుతుంది. లక్షకుంకుమార్చనలు చేస్తారు.

" జ్యోతిర్లింగ స్వరూపేణ బభౌస ర్వేశ్వర శ్శివః
తదాతంపూజయామాస దేవం మల్లీకదంబకైః
దర్శనం బ్రహ్మణెదత్వా బ్రహ్మలోకం దదౌశివః
తదా ప్రభృతి దేవేశం మల్లికేశం వదంతిహి "

— స్కందపురాణం.

బ్రహ్మ శివుని గూర్చి తపస్సు కావించాడు. ఈశ్వరానుగ్రహం

కోసం శతాశ్వమేధాలు కావించాడు. పరమశివుడు పరమ ప్రీతికల వాడై బ్రహ్మదేవునకు జ్యోతిర్లింగ రూపంలో దర్శన భాగ్యం ప్రసాదించాడు. ఆ దివ్య జ్యోతిర్లింగాన్ని బ్రహ్మమల్లి, కదంబ పుష్పాలతో పూజించాడు. అందుచేత బ్రహ్మకు ప్రత్యక్షమై, బ్రహ్మ పూజలు అందుకొని, బ్రహ్మచే ప్రతిష్ఠింపబడిన ఈశ్వరుడు మల్లికేశ్వరుడయ్యాడు మల్లయుద్ధ ప్రవీణుడైన అర్జునుడు ఈ స్వామిని సేవించి, మల్లేశ్వరుడని కీర్తించాడట. అగస్త్య మునీంద్రుడు ఈ స్వామిని జయసేనునిగా భావించి సంకీర్తించినట్లు తెలుస్తోంది. బ్రహ్మదేవునిచేత ప్రతిష్ఠింపబడి అగస్త్యునిచే సేవింపబడి, అర్జునునిచేసంకీర్తి పబడిన మల్లేశ్వరస్వామి ఆలయం కాలవశమై శిథిలమైంది. ఆదిశంకరులు కనకదుర్గ బ్రహ్మచారిణీ దుర్గా ఏకాంతంగాను, ఒంటరిగాను ఉండడం క్షేత్రానికి క్షేమదాయకం కాదని గ్రహించి ఉత్తర దిక్కున శిథిల మల్లేశ్వరాలయాన్ని పునరుద్ధరించారు. శ్రీ మల్లేశ్వరస్వామిని పునః ప్రతిష్ఠించారు. అప్పుడు కనకదుర్గ ఉత్సవ విగ్రహం తీసికొనివచ్చి స్వామిసన్నిధానంలో ప్రతిష్ఠించి కల్యాణ మహోత్సవం కావించారు. నాటినుండి ప్రతిసంవత్సరం చైత్రశుద్ధ పౌర్ణమికి పంచాహ్నిక దీక్షతో కల్యాణోత్సవం నిర్వహింపబడుతోంది. ఇదే కనకదుర్గ బ్రహ్మోత్సవం. ఇదే కనకదుర్గా మల్లేశ్వరుల వసంత కల్యాణోత్సవం. నాటినుండి కనకదుర్గమ్మ కోవెలలో ఉత్సవబేరాలు ఉంచే ఆచారం లేదు. ఈ మల్లేశ్వరస్వామి క్షేత్రపాలక స్వామి. కనకదుర్గక్షేత్రాధి దేవత. అందుచేత అమ్మ దర్శనం తరువాత అయ్య దర్శనం చేయడం ఇచ్చటి ఆచారం. ఆదిశంకరుని సేవలకు కృతజ్ఞతగా మల్లేశ్వరుని గుడికి దక్షిణంగా శంకరమఠం నిర్మింపబడింది. శంకరాచార్యులవారి పాలరాతి విగ్రహం ప్రతిష్ఠింపబడింది. నేటి దేవీ భక్తులకు కనకదుర్గను సుప్రసన్నను చేసిన కీర్తి శంకరునిది. అట్టి ఆది శంకరుని సుధాధవళ మూర్తిని దర్శించి కనకదుర్గ ప్రసరించే స్వర్ణప్రభలలోని జ్ఞాన దీప్తులతో మన హృదయాలను నింపుకుందాము !

కనకదుర్గ లీలలు అనంతాలు. మల్లేశ్వరుని మహిమలు అసంఖ్యాకాలు. మహా శివభక్తుడైన పండితారాధ్యుడు పూర్వం మల్లేశ్వర స్వామి సన్నిధానంలోని నిలచాడు. దేవఋషులకన్న శివభక్తులుమిన్న అన్నాడు. తన ప్రకటనను నిరూపిస్తానని శపథంచేశాడు. అసంఖ్యాకంగా జనులు, భక్తజనులు పండితారాధ్యుడు శివభక్తులుమిన్న అని నిరూపించే తీరుతెన్నులు చూడడానికి తరలివచ్చారు. అందరి సమక్షంలో ఒక పలుచని గుడ్డలో నిప్పులువేసి మూటకట్టి ఒక సమిధకు తగిలించి ఒక విచిత్రమైన ప్రదర్శన కావించాడు. నిప్పులు కణకణలాడుతూనే ఉన్నాయి. కాని నిప్పులను మూటకట్టిన గుడ్డ కాలలేదు. ఆ విధంగా పండితారాధ్యుడు శివభక్తుల మహిమను ప్రదర్శించాడు. ప్రకటించాడు నిరూపించాడు. శ్రీ కనకదుర్గామల్లేశ్వరస్వామివారు పండితారాధ్యుని భక్తికి, శివభక్తికి మెచ్చుకొని ఆ భక్తుని ముందు సాక్షాత్కరించి "నీ శివభక్తి ప్రదర్శనకు, నీ శివభక్తి శక్తి నిరూపణకు నేను ప్రథమ సాక్షిని. శాశ్వత సాక్షిని" అని అనుగ్రహ వచనం పలికి అదృశ్యమయ్యాడు. మహాదేవమల్లేశ్వరస్వామి అట్టి భక్తప్రాణపరాయణుడు. శివభక్తులకు అతడు కొండంత అండ. ఈ కృష్ణాపుష్కర శుభ సందర్భంలో కనకదుర్గను, మల్లేశ్వరస్వామిని సేవించి దేవీలీలను, స్వామి మహిమలను అవగతంచేసి కొందాము. అనుభవిద్దాము. వానికి చెందిన దివ్యాని అనుభూతులను మిగుల్చుకొందాము.

"పంకే జాతాయ తాక్షీం బురమ థన సఖీం పంకజారాలి వక్త్రామ్
సంకాశ ద్దేవ చంద ప్రముథమణి గణోల్లాసితా కల్పకంఠీమ్
సంశుద్దామోదకాశ్మీరజ మృగమద యుక్చందనా లిప్తగండామ్
దుర్గాంబాం భావయేహం శిశు పశు వనితా వృద్ధయోసద్ధనాయాః"

— శ్రీ శంకర భగవత్పాదులు.

"మాధవనుత ఘనచరితాం మాన్త్రికవరైక దృష్ట మహిమాం తామ్
మల్లేశ్వర వరమహిషీం దుర్గాం దేవీం శరణమహం ప్రపదే
దురితానా మపహన్త్రీం దుర్విషయాధీన్ సుఖేన శమయన్తీమ్
దురమపీఠాధ్యక్షాం దుర్గాం దేవీం శరణమహం ప్రపదే
శ్రీచక్రరాజ నిలయాం శ్రీవిద్యా పారగై స్సదా సేవ్యామ్
లలితైర్గీ తైర్వినుతాం దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే"

— శ్రీ విద్యారణ్యస్వామి రత్నస్తబకము నుండి.

" కౌమారీ భువనేశ్వరీ శుభకరీ సర్వార్థ సంపత్కరీ
పంచక్రోశపరీతపూర విజయశ్రీవాటికాధీశ్వరీ
రంగన్మంగళ కృష్ణవేణి తటినీ తీరే సదాసంస్థితా
దుర్గాంబా నవకోటిమూర్తి సహితా మాంపాతు మాహేశ్వరీ !"

— కరుణశ్రీ.





"క్షేత్ర సాహితీ నవవైతాళిక"

"క్షేత్ర చరిత్రోద్ధారక"

## శ్రీ వెలమకన్ని శ్రీరామమూర్తి

జననం : **14-7-1932**

జన్మస్థలం : పిఠాపురం

విద్యాభ్యాసం ; పీఠికాపురాధీశ ప్రభుత్వ కళాశాల, కాకినాడ-ప్రభుత్వ బోధనాభ్యసన కళాశాల, రాజమండ్రి.

శ్రీనివాసుడు 23-5-1958 తేదీన అనుగ్రహించినదివ్యప్రేరణతో, ఆదేశంతో, వీరు ఆంధ్ర సాహిత్యలోకంతో క్షేత్ర సాహిత్య సృజన ప్రారంభించారు. 1959 లో క్షేత్రసాహితి ప్రచారంకోసం క్షేత్రసాహితిని స్థాపించారు. భారతీ సమాజం, క్షేత్రచరిత్రప్రచారసంఘం. క్షేత్ర సాహితిలకు వ్యవస్థాపకులు, అధ్యక్షులు. తమ కలంద్వారా, గళంద్వారా ఆంధ్రదేశంలో దైవపరతత్వాన్ని, శ్రీనివాసుని తత్వనవనీతాన్ని భక్తజనావళికి అందిస్తున్నారు శ్రీనివాసునిపై, ఆంధ్ర క్షేత్రాలపై పది వచనరచనలు ప్రచురించి వాని ప్రతులను భక్తులకు పంచారు. వీరి రచనలు కంచి, శృంగేరిపీఠాధిపతుల, సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల సాహితీ ప్రముఖుల ఆశీస్సులు, మన్ననలు పొందాయి. వీరు ప్రస్తుతం వెమురుపాళ విజయదుర్గా పీఠ ఆస్థాన రచయితలు.

తిరుమల తిరుపతి దేవస్థానాల ఆర్థిక పురస్కారంతో 'క్షేత్రత్రయం,' 'గౌతమీ క్షేత్రాలు,' 'శ్రీనివాస వైభవమ్' 3 భాగాలు ప్రచురితమయ్యాయి 'ఆంధ్ర క్షేత్రాలు' వీరి ముఖ్య రచనలలో ఒకటి

శ్రీనివాసవైభవమ్ తిరుమల తిరుపతి శ్రీ వేంకటేశ్వర సర్వస్వం. ఐతిహాసిక చారిత్రిక, చరిత్ర పరిశోధనాత్మక, శాసన సమన్వితమైన సర్వజనసుగ్రాహ్యమై వచనకావ్యం వీరి శ్రీనివాస వైభవమ్. ఇది కృష్ణాపుష్కరంపైన రచన.

**చిరునామా : క్షేత్రసాహితి - 'శ్రీహరివాసము' లలితానగర్**

**రామచంద్రపురం - 533 255**